శుభాకాంక్షలతో ....


లక్ష్మి జనరల్ స్టోర్స్
బిసెంటు రోడ్.....గవర్నరుపేట
విజయవాడ-2
ఫ్యాషన్ వస్త్రముల సప్లయిదారులు
టెరిలైజ్డు
ప్రింటుఫుల్‌వాయిల్
చీరలు, సాటిన్ గడి,
బార్డరు, గాలాప్రింట్
బార్డరు, స్పెషల్ పల్లు
చీరలు హాయిని,
ఆనందాన్ని యిచ్చే,
ఉత్తమ
వస్త్రములు
కొనండి!

ఫిబ్రవరి - 1986

సంపుటి 2 :

సంచిక 2 :

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS
MACHILIPATNAM

విషయసూచిక

| | | |
|---|---|---|
| అమృతవాణి | - కూచిభట్ల చంద్రశేఖరశర్మ | 2 పుట |
| అందరికీ నమస్కారించి | - | 3 |
| రంజనిమాల | - డా॥ వి. ఫణీంద్రుడు | 4 |
| శ్రీవాణి ప్రథమ వార్షిక మహోత్సవము | - సవ్యసాచి | 6 |
| పత్రిక రచనాస్థాయి దిగజారిపోయింది | - సుంకర సత్యనారాయణ | 7 |
| నీతిలేని జాతి ఏ విధంగా పైకి వెళ్ళుతుంది | - ఆవుల సాంబశివరావు | 8 |
| సాహిత్యం-ఆధ్యాత్మికత | - డా॥ ఇలపావులూరి పాండురంగరావు | 10 |
| తులశమ్మ డైరీ (కథ) | - కావిలిపాటి విజయలక్ష్మి | 13 |
| విశ్వసృష్టి ఎప్పుడు జరిగింది | - కె. ఆర్. కె. మోహన్ | 18 |
| మానవాకారం మానవత్వానికి లక్షణం కానేరదు | - సత్యసాయిబాబా | 20 |
| వైద్యవాణి | - యస్. యన్. దుర్గారావు | 21 |
| డా॥ మాడపాటి హనుమంతరావు | - డా॥ వి. సిమ్మన్న | 22 |
| మా ప్రిన్సిపల్ | - జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 24 |
| యవనిక (సీరియల్) | - రావినూతల సువర్ణాకన్నన్ | 25 |
| జ్యోతిషవాణి | - కవితా కామేశ్వరశర్మ | 30 |
| మనకు తెలియని ప్రపంచం | - మల్లాది వెంకట కృష్ణమూర్తి | 32 |
| నవలా ఓ నవలా (సీరియల్) | - ఇచ్ఛాపురపు రామచంద్రం | 34 |
| దేశ సమైక్యతను సాధించేది సాహిత్యమే | - డా॥ చల్లా రాధాకృష్ణశర్మ | 41 |

శ్లో॥ మిత్రాస్మిన్నగరే మహాన్ కథయతాం; తాళద్రుమాణాం గణః
కోదాతా ? రజకో దదాతి వసనం ప్రాతర్గృహీత్వా నిశి
కో దక్షః ? పరదార విత్త హరణే సర్వోఽపి దక్షో జనః
కస్మాజ్జీవసి హేసఖే ! విషక్రిమిన్యాయేన జీవామ్యహమ్ ॥

ఒకడు ఒకానొక వూళ్లో తన మిత్రుణ్ణి కలిశాడు. యోగక్షేమాలు పరస్పరం పరామర్శించుకొన్న తర్వాత ఆ వచ్చినవాడు మిత్రుణ్ణి కొన్ని ప్రశ్నలు వేశాడు. మొదటగా ఏమడిగాడో తెలుసా. ఏమోయ్ మిత్రమా ! యీ ఊళ్ళో చెప్పుకోదగిన గొప్పవాడెవరన్నా వున్నాడా ? అని.

# అమృతవాణి

**పూచిభట్ల చంద్రశేఖరశర్మ**

ఆ మిత్రుడు తడువుకోకుండా " మా వూళ్ళో గొప్ప తాడిచెట్ల తోపు " అని వెంటనే బదులు చెప్పాడు.

పోనీ మంచి దానం చేసే వ్యక్తి వున్నాడా అని రెండో ప్రశ్న వేశాడు. ఆఁ లేకే, వున్నాడు. అతగాడు రోజూ ప్రొద్దున్నే మురికి గుడ్డలు తీసికెళ్లి చక్కగా వుతికి సాయంకాలానికి జాగ్రత్తగా తీసికొచ్చి యిస్తాడు. అని సమాధానం చెప్పాడు.

అయితే సమర్థుడైనవాడన్నా వున్నాడా మీ వూళ్ళో అని మూడోసారి అడిగాడు. దానికీ ఆలోచించకుండానే తపీమని సమాధానం చెప్పాడు. ఏమంటే మా వూళ్ళో ఒకడేమిటి అందరూ సమర్థులే. ఎందులోనంటావా ! రెండు పనుల్లో. ఒకటి పరస్త్రీల నపహరించటంలోనూ రెండు ఇతరుల ధనం దొంగిలించుటలోనూ. అంటే కాంతా కనకాల నపహరించటంలో మా వూళ్ళో ప్రతి ఒక్కడూ సమర్థుడే అనేది అతని సమాధానం.

పాపం ! ఆ వచ్చిన మిత్రుడికి బుఱ్ఱ తిరిగి పోయింది. జాలిగా ఆ మిత్రునివంక చూస్తూ ఏం మిత్రమా ! యిలాంటి వూళ్ళో ఎలా వుండగలుగుతున్నావోయ్ అని సానుభూతితో అడిగాడు.

విషంలో పుట్టిన పురుగు విషంతింటూ అందులోనే పెరగటం లేదూ ! ఆలాగే నేనూ జీవిస్తున్నా మిత్రమా అంటూ బదులు చెప్పాడట.

ఇంతకూ ఈ శ్లోకంవల్ల మనకు తెలిసిందేమంటే - మనిషి ఏదోరకంగా బ్రతకటంకాదు కావలసింది తనవల్ల పదిమందికి వుపకారం జరగాలి. పెద్దలు లేని వూళ్ళో బ్రతుకు అడవికాచిన వెన్నెలవంటిది. మనకున్న దాంట్లో యితరులకు పెట్టి తినటం కనీస ధర్మం. కీచకుల్లాగాను బందిపోటు దొంగల్లాగాను బ్రతకటం నికృష్టమైన బ్రతుకు. తనవల్ల దేశానికేమైనా మేలు జరుగుతున్నదా అనేది ఆలోచించాలి. మాతృదేశంకోసం సర్వం త్యాగం చేయగలిగిన దక్షత సంపాదించాలి. అంతేగాని మానవ జన్మ యెత్తి వూరూ పేరూ లేకుండా అడవిలో పక్షిలాగా చనిపోవటం వ్యర్థ జీవితమవుతుంది. అందుకనే " కాకి చిరకాలమున్న నే కార్యమగును " అని అన్నారు.

(ఆకాశవాణి సౌజన్యంతో)

## జనవరి రంజనిమాల సమాధానములు

అడ్డము

1. అంబఠయదేవుడు 6. ఉదయ మార్తాండ వర్మ 8. రాజన్న 9. రాయనమంత్రి 10. భాస్కరకవి 11. అక్బర్ 12. కాకతిగణపతి దేవుడు 14. నిస్సార్ 15. రంగనాథము 16. తారామతి 21. తెనాలి రామలింగకవి 23. బలివాడ కాంతారావు 24. కల్హణుడు.

నిలువు :

1. అంబరాయలు 2. జగన్నరాజు 3. దేశాయి నరసింగరావు 4. కొండరాజు 5. నర్మదాశంకర్ 7. యశోధర 10. భారతి 11. అమర్‌నాథ్ 12. కాటమరాజు 13. పద్మిని 15. రంగకవి 17. తిమ్మనామాత్యుడు 18. రాజారామారావు 19. కటకరాజు 20. మేడాంబిక 22. లింగాంబ.

## అందరికీనమస్కరించి.....

శ్రీవాణి ప్రథమ వార్షికోత్సవము విజయవంతంగా జరగడానికి తోడ్పడిన ఆహ్వానసంఘం వారికి, కార్యకర్తలకు అభినందనలు. ప్రత్యేక సంచిక సకాలంలో చక్కగా తీసుకొనిరావడానికి తోడ్పడిన రచయితలను, ప్రకటనదారులను, స్పందన ప్రింటర్స్ వారిని, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారిని, ఆర్టిస్టు బాలిగారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. వార్షికోత్సవంలో పాల్గొని అమూల్యమైన సందేశాల నిచ్చిన ప్రముఖులు శ్రీయుతులు ఆవుల సాంబశివరావు, ఇలపావులూరి పాండురంగారావు, చల్లా రాధాకృష్ణశర్మ, సుంకర సత్యనారాయణ, ద్వైత మధుసూదనశాస్త్రి, ముసునూరి జగన్నాధరావు, భాగవతుల కుటుంబరావు, మల్లాప్రగడ శ్రీరంగారావుగార్లకు కృతజ్ఞతాభివందనలు. 'కనీస విజ్ఞానం' పుస్తకమును రచించి శ్రీవాణికి బోనస్ పుస్తకంగా యిచ్చిన డా. వెలగా వెంకటప్పయ్యగారికి కృతజ్ఞతలు. గతసంవత్సర చందాదారులు చాలామంది రెన్యూవల్ చేసారు. వారికి ధన్యవాదములు. మిగతావారు కూడా వెంటనే రెన్యూవల్ చేసి సహకరిస్తారని ఆశిస్తున్నాను. క్రొత్తగా చందాలను పంపిన వారికి అభినందనలు. జీవిత సభ్యులుగా చేరినవారికి కృతజ్ఞతాభినందనలు.

ప్రత్యేక సంచిక చాలామంది ప్రముఖులకు అందనట్లుగా లేఖలు వచ్చాయి. చాలామందికి రెండవ పర్యాయం కూడా పంపినాను. సంచికలు అయిపోవడంవలన కొంతమందికి పంపలేకపోయినాను. అన్యథా భావించకండి. ప్రముఖులకే ప్రత్యేక సంచిక అందకపోవడం శోచనీయం. ఈ విషయంలో నేనెవరిని నిందించదలచలేదు. అయినప్పటికి ఒకటి మాత్రం వాస్తవం. దొంగతనం చాలా చెడ్డది. అందులో సరస్వతీమాతను దొంగిలించిన వారికి మహాపాతకం చుట్టుకుంటుంది.

జనవరి ప్రత్యేక సంచిక ఆలస్యం కావడం వలన, ఫిబ్రవరి సంచికకూడా ఆలస్యమైనది. కొన్ని వ్యక్తిగతమైన యిబ్బందుల వలన గ్రామాంతరం వెళ్ళవలసివచ్చినది. పేజీలుకూడా తగ్గినాయి. పాఠకులు మన్నిస్తారని ఆశిస్తున్నాను. మార్చి సంచిక యథాతథంగా మార్చి మూడవ వారంలో అందజేయగలను. ఏప్రియల్ సంచిక, సంవత్సరాదిముందు (10-4-1984) అందజేస్తాను. మార్పును గమనించ ప్రార్థన.

యావన్మంది పాఠకులు, అభిమానులు ప్రేమాదరాభిమానములతో శ్రీవాణికి సహకారం అందించి సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా ప్రచారానికి తోడ్పడుతారని ఆశిస్తున్నాను

కొమరగిరి కృష్ణమోహనరావు

---

# రంజనిమాల

సంకలనం
డా॥ వి. ఫణీంద్రుడు

## * ఆధారములు *

ఈ మాటలు/వాక్యములు దాశరథీ శతకము నుండి తీయబడినవి : కళత్ర, కాంపన, గానరు, మానను, తరువున, రసములు, సిరిలిడ, పదధ్యానము, శరణాగత, చిరతర భక్తి, ముక్తినిధానము, తలచినుతింప, ధరసమగాత్ర, రఘువీరనహి, సద్గుణకోండకాండ, భాగవతాపదాచారముల్, గప్పినవేళ మీ స్మరణ గల్గునో, దశకంఠ విలుంఠన చండకాండ, చిక్కని పాలపై మిసిమిజెందిన మీగడ, పదయుగ ళంబు భాగగన భాగములన్, పరుల ధనంబు జూచి పరభామల జూచి – ఈ దిగువ నీయబడిన ఆధారము లతో పై మాటలను/వాక్యములను ఉపయోగించి రంజనిమాలని పూరించండి.



అడ్డం

1. " — హరింపగోరు మద్గురు తర మానసంబు వెడు "
5. " — చిల్క బద్యముఖరంగమునందు నటింప "
6. " — నా తరమె దాశరథి కరుణాపయోనిధీ "
8. " గైకొని భక్తిచే నుడువ — గాక విపత్పరం పరల్ "
12. " — గల్గదో నాటికిప్పుడే తప్పక చేతు మీ భజన "
15. " చేసితి ఘోరకృత్యముల్ : చేసితి — "
17. " — వస్తు సంకలిత కల్మష మగ్నిపుటంబు "
18. " ముద్దులు గుల్కరా చిలుక — రామరాగదే "
19. " — సీత పీడలెగ జిమ్మటకున్ "
20. " ఖండల పూజితుండు — కోదండ కళా ప్రవీణుడను "

నిలువు

1. " — వెనసూని విక్రమాస్పదమగు నచ్చిలీంద్రు . . . . నౌక "
2. " — భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ "
3. " — నౌక తులసీదళమర్పణ సేయువాడు "
4. " — పంచదారతో మెక్కిన భంగిమీ విమల "
7. " విరాజితమైన నీ — చేయుచున్న "
9. " అగణిత సత్యభాష — ఘోష దయాల సజ్ఞరీ "
10. " — గావమన్న తుది మాటకు సద్గతి జెందె గావునన్ "
11. " ఎక్కడి తల్లిదండ్రి సుత లెక్కడివారు . — బాంధవం "
13. " విన్నపమాలకింపు ప్రతి లోకమందు "
14. " సజ్జన పరిపాలశీల దివిజస్తుత — "
16. " —గట్టి వేయగదె దాశరథీ కరుణాపయోనిధీ " ★

జనవరి సంచిక సమాధానములు 2వ పేజీలో

# 'శ్రీవాణి' ప్రథమ వార్షిక మహోత్సవం

**అది జనవరి 11వ తేది.**

ఒక ప్రైపున మంగళ వాయిద్యాలు మ్రోగుతున్నాయి, పండితుల వేదఘోష ప్రతిధ్వనిస్తున్నది. నవ్యకవి నాదెళ్ళ నేతృత్వంలో కడువైభవోపేతంగా శ్రీ దైత శ్రీరాములు కళావేదిక అలంకరించబడింది. వేలాదిమంది సాహితీ వేత్తలు, అభిమానులు, కవులు, కళాకారులు, విద్యా వేత్తలు తమతమ ఉచితాసనాలలో బారులు తీర్చి ఆశీనులైనారు. శ్రీ ముట్నూరి కృష్ణరాయ పురమందిర ఆవరణం విద్యుత్ తోరణాలతో, ట్యూబ్‌లైట్లతో, మామిడి తోరణాలతో, కొబ్బరి మట్టలతో కడువైభవోపేతంగా చూడముచ్చటగా అలంకరించబడినది. అది శ్రీవాణి జన్మదినోత్సవ మహోత్సవం. సరిగా సాయంత్రం 5-30 గం. లు అయింది. శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి సరస్వతీ విగ్రహం ముందు కొబ్బరికాయ కొట్టడంతో సభ ప్రారంభమైంది.

నవ్యకవి నాదెళ్ళ ఈ మహోత్సవానికి ప్రత్యేకంగా విచ్చేసిన సాహితీవేత్తలను ఒక్కొక్కర్ని వేదిక మీదికి ఆహ్వానించారు. స్థానిక ఎల్. ఐ. సి. ఎంప్లాయీస్ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ మాజీ అధ్యక్షులు శ్రీ లంక సుందర రామయ్య అతిథులను పరిచయం చేసారు. ఆహ్వానసంఘ గౌరవ అధ్యక్షులు శ్రీ ముసునూరి జగన్నాధరావు స్వాగత వచనములు పలికారు. సంపాదకుడు శ్రీ కొమరగిరి శ్రీవాణి సంవత్సర సమీక్ష చేసారు. ఆహ్వాన సంఘ సభ్యులు డా. ధన్వంతరీ ఆచార్య, రైస్ మిల్లర్స్ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ గుడివాడ రామచంద్రరావు, సరస్వతీ కళాసమితి కార్యదర్శి శ్రీ సి. యన్. రంగస్వామి, ఆంధ్ర సారస్వత సమితి కార్యదర్శి శ్రీ బాలస్వామి మరియు శ్రీయుతులు తుమ్మలపల్లి సదాశివరావు, కూరాళ్ళ కామేశ్వరరావు, యల్. యస్. శాస్త్రి, యార్లగడ్డ రాధాకృష్ణమూర్తి, ఉప్పులూరి సుబ్బారావు, యం. యస్. యన్. మూర్తి, దివాకర్ల వేంకటేశ్వర్లు, చిరువోలు రామమోహనరావు ప్రభృతులు వేదిక నలంకరించిన సాహితీ మూర్తులను పూలమాలాలంకృతులను చేసారు. కుమారి పి. కిరణ్మయి ప్రార్థన చేసింది.

ప్రముఖ సాహితీవేత్త, కృష్ణాజిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ సుంకర సత్యనారాయణ అధ్యక్షతన సభ ప్రారంభమైంది. శ్రీవాణి ప్రథమ వార్షికోత్సవ ప్రత్యేక సంచికను సరిగా గం. 5-55 నిముషములకు లోకాయుక్త జస్టిస్ శ్రీ ఆవుల సాంబశివరావు ఆవిష్కరించారు. ప్రకాశం జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శి శ్రీ వెలగా వెంకటప్పయ్య రచించిన " కవిసవిజ్ఞానం " పుస్తకము స్థానిక హిందూ కళాశాల అనుబంధసంస్థల కార్యదర్శి, ప్రముఖ విద్యావేత్త శ్రీ దైత మధుసూధనశాస్త్రి చేత ఆవిష్కరింపబడింది. తదనంతరము లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావు గారు ఆధునిక సమాజంలో పత్రికల బాధ్యతను గురించి మాట్లాడారు. న్యూఢిల్లీ నుంచి ప్రత్యేకంగా విచ్చేసిన యు. పి. యస్. సి. డైరెక్టర్ డా. ఇలపావులూరి పాండురంగారావుగారి మహోపన్యాసం సభికులను తన్మయత్వంలో ముంచివేసింది. బహుభాషా పండితులు మదురై కామరాజ్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ డా. చల్లా రాధాకృష్ణశర్మగారి సాహిత్యోపన్యాసంతో సదస్యులు సంభ్రమాశ్చర్యాలతో పులకితులైనారు.

తదనంతరం స్థానిక జాతీయ కళాశాల మాజీ ప్రిన్సిపాల్, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ భాగవతుల కుటుంబరావు, ఆర్ష విద్యాభూషణ, మధురభారతి శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగార్లను ఘనంగా సన్మానించారు. స్పందన సాహితీ సమాఖ్య కార్యదర్శి

శ్రీ గుత్తికొండ సుబ్బారావు వందన సమర్పణతో సభ ముగిసింది.

నాట్యాచార్య శ్రీ ఏలేశ్వరపు నాగేశ్వరశర్మ శిష్యురాండ్రు జూనియర్ ఆంధ్రా సిస్టర్స్ కుమారి శిరీష, షర్మిల, మాధవి మరియు కుమారి తుమ్మలపల్లి హనుమ దుర్గల కూచిపూడి భరతనాట్యము, జానపద నృత్యములు ఆనాటి ప్రత్యేక ఆకర్షణ. కుమారి చంద్రకళ ప్లేబాక్ సభకులను ఆనందోల్లాసాలలో ముంచి వేసింది. కళాకారులకు డా. చిత్రపు బాపూజీ మెమెంటోలను బహూకరించారు.

ఆనాడు జరిగిన మహోత్సవం నిజంగా బందరు చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించవలసిన సువర్ణదినం. బందరులో ఈ మధ్యకాలంలో ఇటువంటి సాహితీసభ జరిగియుండలేదని సర్వుల అభిప్రాయం. శ్రీవాణి జన్మ దినోత్సవ మహోత్సవంలో అన్ని రంగాలకు చెందిన బందరు పురప్రముఖులు పాల్గొనడం శ్రీవాణి యెడల బందరు పెద్దలకుగల గౌరవాదరాభిమానాలకు నిదర్శనం.

— ' సవ్యసాచి '

# మలేషియాలో తెలుగువారు

మలేషియాలో లక్ష యాభై వేలమంది తెలుగు వారున్నారు. ఈ తెలుగు వారంతా మలేషియా పౌరులే.

మలేషియాలో ఆంధ్ర సంఘముంది [ చిరునామా : ఆంధ్రా అసోసియేషన్ ఆఫ్ మలేషియా, పోస్టుబాక్స్ నెం 2, బేగన్‌డాటో ( Began Datoh ) పేరాక్ (Perak) ] ఇది 17-7-1955న స్థాపించబడింది.

శ్రీ మదిని సోమనాయుడు, శ్రీ నేతేటి దుర్గయ్యల పవిత్ర ప్రయత్నాల ఫలితంగా యీ సంఘం ఆవిర్భవించింది. 1956లో ఇది లేఖ్యారూఢం ( రిజిష్టర్ ) చేయబడింది.

దీని లక్ష్యాలు : 1. తల్లిభాష తెలుగు తెలియక చెదిరియున్న తెలుగువారిని సమైక్య పరచటం. 2. క్షీణిస్తున్న తెలుగుభాషా సంస్కృతులకు కొత్త ఊపిరి పోయటం. 3. తెలుగువారి ఆర్థిక రాజకీయ స్థాయిని పెంపొందించుటకు ప్రణాళికలను సిద్ధపరచి సహకరించటం 4 అవసరమైన వనరుల వ్యూహాల ద్వారా తెలుగువారిని విద్యావంతులుగా చేయటం.

తెలుగు సంఘం సొత్తుగా ఇరవై ఎకరాల రబ్బరు తోట ఉంది. ఇదిగాక కొన్ని వేల మలేషియన్ డాలర్ల నిలవధనం ఉంది.

మలేషియా రేడియో, టెలివిజన్లలో తెలుగు కార్యక్రమాలు ప్రసారం చేయించటానికి ఈ సంఘం కృషి చేస్తోంది. మలేషియాలో 25 తెలుగు పాఠశాలలున్నాయి. వాటికి ప్రభుత్వ గుర్తింపు కోసం సంఘం ప్రయత్నిస్తూంది. తెలుగు వారిని విద్యావంతుల్ని చేయటానికి సహకరించేందుకు తెలుగువారి సహకార సంఘాలను నెలకొల్పింది. ఉగాది మొదలయిన తెలుగు పండుగలను, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడంలో యీ సంఘం ఎనలేని సేవ చేస్తుంది.

"తెలుగు తల్లి" అన్న పేరిట ఈ సంఘం సారస్వత సంచికలను విడుదల చేస్తూంది. ఒక కచేరి భవనాన్ని నిర్మించటానికి ప్రతిపాదించింది. మొత్తం మలేషియాలో యీ సంఘానికి పదునైదు శాఖలున్నవి.

— పి. మోహన్

'శ్రీవాణి' వార్షికోత్సవంలో

# పత్రికా రచనాస్థాయి దిగజారిపోయింది

పత్రికా రచనా స్థాయి చాలా దిగజారిపోయిందనే విషయం చెప్పడానికి నేను విచారిస్తున్నాను. ఎందువలనంటే పత్రికలో ఒకవార్త పడితే చాలు, అది చాలా అథారిటీ అని ఈనాడు ప్రజలు భావిస్తున్నారు. ఆ వార్తలో నిజమున్నదా? లేదా? విమర్శన చేయని ఈ రోజులలో, పత్రికలలో పడ్డ వార్త జరిగివుంటుందిలే యని భావించే ఈ తరుణంలో పత్రికా రచన అంత తేలిక కాదు. కొన్ని పత్రికలు కేవలం శీలహరణం మీదనే ఆధారపడి సొమ్ము చేసుకుంటున్నాయి. ప్రజారంగంలోవున్న మనిషి మీద ఏదో ఒక అభాండంవేసి పత్రికలను అమ్ముకుంటూ, సొమ్ము చేసుకుంటున్న ఈ తరుణంలో, పత్రికలలో పడ్డదంతా యథార్థమని భావిస్తున్న ఈ రోజులలో కేవలం ఒక విషయ ప్రధానం మీద పత్రికను నడపడం బహు కష్టం. ప్రస్తుతం వస్తున్న పత్రికలు చూస్తున్నారు, నవలలు చదువుతున్నారు. సెక్స్, దిగంబర సాహిత్యం చదివి తన్మయత్వం చెందుతున్నారు. రోజురోజుకు పత్రికా రచనా స్థాయి దిగజారిపోతున్నది. ఇటువంటి తరుణంలో ప్రత్యేకంగా ఒక సాహిత్యాన్ని గురించో, ఆధ్యాత్మిక చింతనను గురించో, విద్యా విషయాలను గురించో చక్కటి వ్యాసములను వ్రాసి, అది చదువగల పాఠకులను ఏర్పాటు చేసుకొని పత్రికను నడపడం కష్టసాధ్యమైన ఈ రోజులలో కృష్ణమోహనరావుగారు ఈ సాహసం చేయడానికి పూనుకోవడం హర్షించదగ్గ విషయం. ప్రస్తుత దుస్థితిలో పత్రికా స్థాయిని పెంచడం అంత తేలిక కాదు. అయినప్పటికి పాఠకులకు, అవసరమైన, అత్యున్నతమైన, ఆదర్శ భావాలను శ్రీవాణి ద్వారా ప్రచారం చేయ సంకల్పించుకోవడం ఇది నిజంగా ఒక గొప్ప సాహసమే. ఆయన కృషి అభినందనీయం.

బందరు పట్టణం చాలా పురాతనమైనది. అనేక రంగాలలో నిష్ణాతులైన మహామహులను తెలుగునాట, భారతదేశానికి సమర్పించిన పట్టణం. అందులో పత్రికా రచనలో ముట్నూరి కృష్ణారావులాంటి శేముషీ దురంధరులను, ప్రజ్ఞాపాటవంగల రచయితలను భారతదేశానికి యిచ్చిన ఈ బందరు పట్టణంలో మరల ఈ సాహితీ సదస్సు పేరుతో ఈనాడు జరుగుతున్న శ్రీవాణి వార్షికోత్సవ మహోత్సవం - ఇది నిజంగా మనమంతా ఎంతో సంతోషించదగ్గ తరుణం.

కృష్ణమోహనరావుగారు నాకు చాలాకాలం నుంచి తెలుసు. ఏ కార్యక్రమం తలపెట్టినా పట్టుదలతో, సాహసంతో పూర్తిచేయగల విలక్షణమైన వ్యక్తి ఆయన. ఆయన అనేక రంగాలలో ప్రవేశించి అనుభవాన్ని గడించారు. రాజకీయరంగంలో వున్నాడు. అనేక మహోద్యమాలను నడిపాడు. సాహిత్య కళారంగాలలో కూడా ప్రవేశించాడు. అనేక రంగాలలో అనుభవాన్ని పొంది, చివరికి పత్రికా రంగంలో ప్రవేశించాడు. ఈ పని ద్వారా శాశ్వతంగా సమాజానికి చక్కటి సేవ చేయగలుగుతాననే భావంతో చక్కటి పత్రికను స్థాపించాడు. చదువరుల హృదయాలలో శాశ్వతమైన ముద్రవేయగల పత్రికను ప్రారంభించి, ఒక మంచి పని చేసాననే తృప్తి పొందాలనే తలంపుతో లాభం ప్రధానంగా చూచుకొనకుండా, ఒక విలక్షణమైన పత్రికను నడపడానికి సాహసించారు. ఇది నిజంగా ఒక మహాప్రయత్నమే. ఇది కేవలం ఒక వ్యక్తి వల్ల అయ్యే పని కాదు. అయితే ఇటువంటి సాహసానికి దిగిన వ్యక్తిని ప్రోత్సహించడం సాహిత్యాభిమానుల కర్తవ్యం. దానికి మీరంతా సంపూర్ణ, సహకార, సానుభూతి సంపత్తులను అందజేయాలని కోరుతున్నాను. ★

'శ్రీవాణి' వార్షికోత్సవంలో

# నీతిలేని జాతి ఏవిధంగా పైకి వెళ్లుతుంది?

- శ్రీ ఆవుల సాంబశివరావు



ప్రస్తుత సమాజంలో చాలామందిలో పనిచేయాలనే కోరిక సన్నగిల్లుతున్నది. రావాల్సినటువంటిది ఏదో ఒక విధంగా ఒడుక్కొని పనీ పాటా లేకుండా కూర్చోవాలనే అభిలాష చాలామందిలో ప్రబలుతున్నది. ఇది ఏమాత్రం క్షేమకరం కాదు. మనల్ని ఎవరో వచ్చి ఉద్ధరిస్తారను కోవడం పొరపాటు. మనల్ని మనమే ఉద్ధరించుకోవాలి. నేను వంద రూపాయలు జీతం తీసుకుంటున్నాను. కాబట్టి దానికి తగ్గ పనిచేయాలనే మనస్తత్వం ప్రబలాలి. అదే నీతి. అయితే ఈనాడు ఆ నీతి కనపడటంలేదు. నీతిలేని జాతి ఏ విధంగా పైకి వెళ్ళుతుంది? జాతిని ముందుకు తీసుకొని వెళ్ళడానికి మనం ఏం చేయాలి? ప్రతి ఒక్కరూ ఆలోచించాలి. ఈ విషయంలో ముఖ్యంగా పత్రికలమీద బ్రహ్మాండమైన గురుతర బాధ్యత వున్నది. సమాజాన్ని తీర్చిదిద్దేందుకు పత్రికలు కృషి చేయాలి. పత్రికలు తమ వంతు బాధ్యతను నిర్వర్తిస్తున్నాయా? అనేదే ఈనాటి ప్రశ్న. కొన్ని రకాల పత్రికలను ప్రజలు చాలా విరివిగా కొంటున్నారు. అర్ధనగ్న దృశ్యాలు వున్న పత్రికలు బాగా అమ్ముడు పోతున్నాయి. లోపల విలువైన సమాచారాన్ని అందించే పత్రికలు కూడా ఈ ప్రలోభానికి లోనుకావడం నిజంగా దురదృష్టకరం.

కొన్ని పత్రికల స్థాయి దిగజారిపోతున్నది. ప్రభుత్వమో మరెవరో బయటవారు ఆంక్షలు విధించే కంటే విశ్వనాథ సత్యనారాయణగారు చెప్పినట్లు "ఎవరైనా తప్పులు చేస్తే సరిదిద్దగలడట్టి సామంతుడేరాజు" అన్నాడు సముద్రుడ్ని, కిన్నెరసాని పాటలలో...." తానుగా దిగినా తప్పువారులకు". అందరికీ దోవ చూపించవలసినవారు, భావాలను పంచిపెట్టవలసినవారు, అమృతాన్ని చిలకించి అందరికీ అందించడానికి పుట్టినటువంటి ఈ పత్రికలు స్థాయిలో వుండాలి. ఏదైనాస్థాయి తగ్గిందంటే ఆత్మ పరిశోధన వారికి వుండాలి. ఆత్మ క్రమశిక్షణ వుండాలి. ఎవరో బయటివారు క్రమశిక్షణను పైనుంచి విధిస్తే అంత సంతృప్తికరంగా వుండదు. పత్రికాస్వేచ్ఛ మనకు చాలా పవిత్రమైనటువంటిది. ఆ స్వేచ్ఛకు భంగం కలిగించకూడదు. ఆ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలి. ఇది ముఖ్యంగా పత్రికా రచయితల మీద ఈ బాధ్యత వున్నది. ఆ బాధ్యతను విస్మరించినట్లయితే ప్రమాదం. ఎవరికివారే క్రమశిక్షణను పాటించాలి. ఈ మాత్రం ఆత్మసంయమనం చేసుకోలేమా? పత్రికలవారు తమకు తామే ఆలోచించుకోవాలి.

పత్రికా నిర్వహణలో చాలా కష్టాలున్నాయి, నిష్ఠూరాలున్నాయి. అందులో మాస పత్రికల మీద, త్రైమాస పత్రికల మీద గురుతర బాధ్యత వున్నది. ఈనాడు చాలా వార పత్రికలు కేవలం కథల పత్రికలుగా తయారైనాయి. ఆలోచనలు రేకెత్తించి, అందించి, విజ్ఞానాన్ని యిచ్చి

మనసుకు వేడిని కలిగించే పత్రికలు మాస, త్రైమాస పత్రికలు. పోలీసు బిల్లు, ప్రెస్‌బిల్లు, ప్రాంతీయ పార్టీలు జాతీయ పార్టీల గురించి సద్విమర్శనలను నిర్మొహమాటంగా అందించడం పత్రికల బాధ్యత. ఇటువంటి ప్రామాణికమైన సేవ చేస్తున్న మాస పత్రికల యెడల అటు పత్రికా రచయితలు గాని, పాఠకులు గాని తమ వంతు విద్యుక్తధర్మాన్ని నిర్వర్తిస్తున్నారా ? అనే విషయం కూడా గమనించాలి.

పత్రికల పాత్ర చాలా గురుతరమైనది. సిద్ధాంతాలని నిర్వచించే విషయంలో పత్రికలు చేయవలసిన బాధ్యత ఎంతో వున్నది. సమాజాన్ని తీర్చి దిద్దడంలో పత్రికల బాధ్యత చాలా ఎక్కువగా వున్నది. కష్టాలున్నాయి, నిష్టూరాలున్నాయి. అనాడు ఎప్పుడో రాణా ప్రతాప్ సింహ లాంటివాళ్లు మనుష్యులుంటే ఈనాడు ఇదిగో కొమరగిరి కృష్ణమోహనరావుగారు లాంటి వాళ్ళున్నారు. తాను త్యాగం చేసి సాంఘికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా, ఆర్థికంగా నేను కొన్ని భావాలను ప్రజలలో ప్రచారం చేస్తానని, ధైర్యంతో గుండె నిబ్బరంతో ముందుకు వచ్చే మనుష్యులున్నారు. ఉండబట్టే ఈనాటికీ పత్రికల యెడల ప్రజలకు ఇంకా గౌరవం నిలిచి వున్నది. కొంతకు కొంత సన్నగిల్లుతున్నప్పటికీ గూడాను పత్రికలు నిలబడగలుగుతున్నాయంటే, ఇదిగో ఇటువంటి శ్రీవాణి పత్రికలలాంటి వాటి మూలకంగా మాత్రమే. కష్టనిష్టూరాలు ఎన్నయినప్పటికి గూడాను, నేను వాటికి తలవంచక ముందుకు వెళ్ళతాను అనే వారి కృత నిశ్చయాన్ని నేను హృదయపూర్వకంగా అభినందించుచున్నాను. ఎంత కష్టం వచ్చినప్పటికి నా పత్రిక యొక్క స్థాయిని దిగజార్చను అనే సత్యాన్ని చెప్పిన వారిలో అప్పుడు రామకోటేశ్వరరావుగారు, ఇప్పుడు భావరాజు నరశింహారావుగారిని చూచాను. ఇప్పుడు ఈయన గారిని చూస్తున్నాను. స్థాయికి దిగదార్చకుండా నేను ముందుకు వెళ్ళతాననే విషయం ఉన్నదే మనమెంతో అబ్బుర పడవలసిన విషయం, మెచ్చుకోవలసిన విషయం.

## శ్రీవాణి' పవిత సభ్యులు



### శ్రీ సింహాద్రి సత్యనారాయణ
M. L. A.
అవనిగడ్డ

నేను శ్రీవాణి 12 సంచికలను చూచాను. స్థాయిని దిగదార్చే విషయాలు అందులో ఏమీ కనపడలేదు. ఎక్కడా అటువంటి పొరపాట్లు లేవు. నిస్సందేహంగా, నిర్మొహమాటంగా భావాలు వ్యక్తం చేశారు గాని, వ్యక్తిగతమైన ఆరోపణలు అందులో లేవు. నేను పత్రికల వారికి చెప్పే హితవు ఒక్కటే. సిద్ధాంతపరంగా ఎంతయినా విమర్శించండి. ఈనాడు సిద్ధాంత పరంగా, భావ పరంగా చర్చ జరగాలి. ఆధునిక సమాజాన్ని సంతరించుకోవాలని, నిర్మించుకోవాలని, అనుకుంటున్నాం. సమాజాన్ని నిర్మించుకోవడంలో పత్రికల మీద బాధ్యత ఎక్కువగా వున్నదని భావిస్తున్నాను.

పాఠకుల బాధ్యత కూడా చాలా వున్నది. శ్రీవాణి లాంటి మంచి పత్రికలను ప్రోత్సహించవలసిన బాధ్యత పాఠకుల మీద వున్నది. ప్రతి ఒక్కరూ యథాశక్తిగా సహాయం చేయాలి. లేకపోయినటయితే మంచి పత్రికలు మనజాలవు. జాతికి భవిష్యత్తు వుండదు. శ్రేయస్సుకోసం, జాతి భవిష్యత్తు కోసం శ్రీవాణి లాంటి పత్రికలను బ్రతికించుకోవాలి. ★

'శ్రీవాణి' వార్షికోత్సవంలో

# సాహిత్యం - ఆధ్యాత్మికత

- డా॥ ఇలపావులూరి పాండురంగరావు



కత అజానారే జానాయిలే తుమి
కత ఘరె దిలె ఠాయి
దూర్‌కే కరిలె నికట బంధు
పర్‌కే కరిలె భాయి - గీతాంజలి

ఏనాటి మహాకవుల మీదనో ఈనాటి మానవ జాతికి కూడా మమకారం ఏర్పరచి పెంచేది వాళ్ళ వాగ్విలాసమే. వాగ్విదాం వరుల వాక్కు అలాంటిది. మహాకవుల వాక్కులోనే యింత మాధుర్యం ఉంటే అలాంటి మహాకవులకు మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలను ప్రసాదించే శ్రీదేవి వాక్కు 'శ్రీవాణి' మాధుర్యానికి మారుపేరయి ఉండాలి. అందుకే శ్రీవాణి బందరులో వెలసింది. బందరు తియ్యని మిఠాయిలకు ఎంత ప్రసిద్ధికెక్కిందో మధుర వాక్కుల మహనీయులకు కూడా అంత పేరుపొందింది. కనుకనే శ్రీవాణిలాంటి పేరు ఈ పత్రికా సంపాదకులకు స్ఫురించింది.

శ్రీవాణి మీది మమకారం చేత శ్రీవాణి వార్షికోత్సవానికి నేను ఢిల్లీ నుంచి బందరు వచ్చానని శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారు అన్నారు. ఆ మాట అక్షరాలా నిజం. శ్రీవాణి తొలి సంచికను చూడగానే నా దృష్టిని ఆకట్టుకుంది 'శ్రీవాణి' నామకరణం. శ్రీవాణి పేరు ఎంత చక్కగా ఉందో పత్రిక తీరు కూడ అంత పటిష్ఠంగా ఉండటం చూచి ఇంత చక్కని పేరిట ఇంత మంచి పత్రికను ప్రారంభించిన వ్యక్తిని చూచితీరాలని నా మనస్సులో సంకల్పం కలిగింది. అది శివ సంకల్పం కావటంవల్ల కాబోలు శ్రీవాణి ప్రథమ వార్షికోత్సవానికి నన్ను ఆహ్వానించాలనే ఆలోచన శ్రీ కృష్ణమోహనరావుగారికి ఉదయించింది.

అసలు వాణి లోనే ఆకర్షణ శక్తి ఉంది. ఎంతమంది అపరిచితులనో తనకు సుపరిచితులను చేసి, ఎంతమంది యిండ్లలోనో తనకు తావరమయిన తావు కల్పించి, దూరస్థులను సన్నిహితులను కావించి, పరులను స్వజనులుగా మార్చిన తన వాణిని స్మరించి విశ్వకవి రవీంద్రుడు పులకించి పోతాడు.

శ్రీవాణికి వార్షికోత్సవం ప్రత్యేకంగా చేయవలసిన అవసరంలేదు. శ్రీ అంటేనే వర్షం కురుస్తుంది. తన తరుణారుణ కిరణకాంతితో బ్రహ్మాండ మండలాన్ని నిర్విశేషంగా నిమజ్జితం చేసే శ్రీమాత నిజారుణప్రభాపూర మజ్జద్ బ్రహ్మాండమండలా - బ్రహ్మాండ పురాణం ఉదయం, సాయంత్రం సిరులను కురిపిస్తూ ఉంటుంది. కాబట్టి ఆమెకు ప్రతిదినం వార్షికోత్సవమే. ఆ సత్యాన్ని అవగాహనం చేసుకునేందుకే ఈనాటి వార్షికోత్సవం తోడ్పడుతుంది. శ్రీనామం స్మరించగానే సహస్రనామ సంకీర్తనకర్త భీష్మాచార్యుని నోట శ్రీవర్షం కురుస్తుంది. ప్రాపంచిక పరిధులను పరిహరించి పారమార్థిక పరమా

వరిని సంగ్రహంగా సమగ్రంగా సమస్త జీవకోటికి ప్రసాదించే శివస్వరూపుడయిన విష్ణుమూర్తి శాంతనవుల ప్రశాంత దృష్టికి "శ్రీవత్సవక్షునిగా, శ్రీవాసునిగా, శ్రీపతిగా, శ్రీమంతులలో శ్రేష్ఠునిగా, శ్రీదునిగా, శ్రీశునిగా, శ్రీనివాసునిగా, శ్రీనిధిగా, శ్రీవిభావనునిగా, శ్రీధరునిగా, శ్రీకరునిగా, ఆశ్రయించినవారికి శ్రేయస్సును, ప్రసాదించే శ్రీమంతునిగా" సాక్షాత్కరిస్తాడు.

శ్రీవత్సవక్షః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః
శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః
శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః
(శ్రీవిష్ణు సహస్రనామం)

శ్రీ తత్త్వమంతా ఈ పద్నాలుగు నామాల్లో ఇమిడి ఉన్నదనిపిస్తుంది. అంతేకాక పద్నాలుగు భువనాలలోని శ్రీభావం భీష్మాచార్యుల నోట వెలువడిన యీ దివ్య నామాలలో కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. అలాంటి శ్రీపదంతో ప్రారంభించిన చక్కని పేరు శ్రీవాణి. అందుకే నాకు శ్రీకారం మీద ఇంతటి మమకారం. ఆ మమకారమే నన్నింత దూరం రప్పించింది.

ఏ శుభకార్యమయినా శ్రీకారంతోనే ఆరంభమవుతుంది. హిందీలో కూడా ఒక పనిని ఆరంభించటాన్ని 'శ్రీ గణేశ్', అంటారు. పంజాబీలో 'సత్‌శ్రీకార్' అనే పదం అభివాదన పరంగా వాడటం సిక్కులకు ఆచారం. అలాగే ఒక పని పరిసమాప్తి చెందటాన్ని 'ఇతిశ్రీ' అనటం కూడా అలవాటు. తెలుగు వాళ్ళకు కూడా శ్రీకారం మీద అభిమానం మెండు. సిరి, చుక్క అని వెనక వీధిబడిలో మొట్టమొదట బడికి వచ్చిన పిల్లల పేర్లు వ్రాసేందుకు వాడేవారు. తెలుగు సాహిత్యానికి (ముఖ్యంగా గ్రంథరూపంలో లభించిన సాహిత్యానికి) శ్రీకారం చుట్టిన నన్నయభట్టు శ్రీదేవితోపాటు వాగ్దేవినీ, పర్వత పుత్రినీ స్మరిస్తూ "శ్రీవాణి గిరిజా" అని మంగళాచరణం చేస్తారు. లోకత్రయం, వేదత్రయం, మూర్తిత్రయం మాత్రమే మనస్సులో ఉంచుకొని చేసిన యీ ప్రార్థనా శ్లోకం వాగనుశాసనునికి గల వాక్సిద్ధి వల్ల తర్వాత తర్వాత కవిత్రయంగా ఫలించింది. ఈ కవిత్రయంలో రెండవకవి కవిబ్రహ్మ తిక్కన సోమయాజి తన "ఇష్టసిద్ధి"కై శ్రీని, గౌరినీ స్మరిస్తారు. కాని ఉభయ కవిమిత్రుల దృష్టిలో ఈ రెండు మూర్తులకూ భేదం కనిపించదు. హరిహరులను అభేదబుద్ధితో భావించి సేవించే భక్తజనులకు పరతత్త్వం సాక్షాత్కరిస్తుందని తిక్కన దృఢ విశ్వాసం. నన్నయభట్టు మూడు మూర్తులను స్మరిస్తే తిక్కన వారిలో ఇద్దరినే ఎన్నుకొని అందులో కూడా అద్వైతాన్ని అందుకొని ఆనందించారు. ఆ తర్వాత సహజ పాండిత్యపాథోధి అయిన పోతనామాత్యుడు తనదయిన పోతన తనాన్ని పురస్కరించుకొని కేవలం శ్రీకైవల్య పదంలోనే సకలాక్షర సాకల్యం సాక్షాత్కరించుకుంటారు. శ్రీ అంటే చాలు, వాణిని గురించి కానీ, గిరిజను గురించి కానీ వేరే చెప్పనక్కరలేదని మరేమీ అక్కరలేని పోతనామాత్యుడు హృదయ పూర్వకంగా భావిస్తాడు.

నిజానికి శ్రీ అంటే కేవలం లక్ష్మి, సిరి, సంపద అని అర్థం చెప్పుకోవటం అంత సమంజసం కాదు. "ఋచః సామాని యజూంషి సా హి శ్రీ రమృతా సతాం" అని వేదవాక్యం. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం — ఈ మూడింటినీ కలిపి శ్రీ అంటారట. అదే సత్పురుషులకు అమరత్వాన్ని ప్రసాదిస్తుందట. దీనినిబట్టి శ్రీ శబ్దంలో సమస్త సారస్వత సశ్రీకత సార గర్భితంగా సన్నిహితంగా సమన్వితంగా కూడి ఉంటుందని స్పష్టంగా తెలుస్తుంది. ఈ దృష్టితో చూస్తే శ్రీకీ, వాణికీ భేదమేలేదు. శ్రీ అంటేనే వాణి అవుతుంది. వాణిలోనే శ్రీ ఉంది. అందువల్ల శ్రీవాణి అనే పేరులో అంత గాంభీర్యం, సారస్యం గోచరిస్తాయి. శ్రీదేవి పలికే వాక్కు శ్రీవాణి. శ్రీయుక్తమయిన వాణి శ్రీవాణి. శ్రీస్వరూపిణి అయిన వాణి శ్రీవాణి. ఏ విధంగా చూచినా శ్రీవాణి పరమ రమణీయమైన నామం.

ఈ నామంలోనే నేను ప్రసంగించవలసిన విషయంకూడా ఉంది. శ్రీశబ్దం పరమార్థవాచకం. వాణి రమణీయమైన

అర్థాన్ని వ్యక్తంచేసే రసాత్మకమయిన వాక్య సంగ్రహం. శ్రీశబ్దం ఆధ్యాత్మికమయిన పరమార్థాన్ని ప్రసాదిస్తే వాణి సారస్వతమయిన అర్థసాహితిని సాధిస్తుంది. అర్థం, పరమార్థం – రెండూ శ్రీవాణి అనే పేరులో ప్రతిధ్వనిస్తాయి. అర్థం వేరూ, పరమార్థం వేరూ కాదు. రెండూ ఒకదానిలో ఒకటి ఇమిడి ఉంటాయి. అర్థించదగినది అర్థం. అర్థించవలసిన అవసరం లేకుండా చేసేది పరమార్థం. పార్థివ జగత్తులోని అర్థాన్ని అర్థం చేసుకున్న తర్వాతనే పారమార్థికమయిన పరతత్త్వాన్ని సాధించటం సాధ్యమవుతుంది. "శ్రీవాణి" పత్రికలో కూడా అర్థానికీ పరమార్థానికీ ఇలాంటి అన్వయం కుదరాలని నా అభిమతం. అర్థాన్ని త్యజించి పరమార్థాన్ని అందుకోవాలని ప్రయత్నించటం వ్యవహార విరుద్ధమయిన పని. అలా అని అర్థం కోసం పరమార్థాన్ని విస్మరించటం వల్ల పత్రిక తన సమాజానికి న్యాయం చేకూర్చలేక పోతుంది. కాబట్టి యీ రెండింటినీ కూడగట్టుకొని పోవాలి. అర్థనగ్న చిత్రాలతో అపహాసిత రచనలతో ధర్మం – అధర్మం, న్యాయం – అన్యాయం, సత్యం – అసత్యం, సక్రమం – అక్రమం, నీతి – అవినీతి తెలియకుండా కాలప్రవాహంకో కొట్టుకొనిపోతున్న సమాజాన్ని దరిజేర్చి దారిచూపవలసిన బాధ్యత ఈనాటి సాహితీపరుల మీద ఉంది. వాళ్ళ ప్రబుద్ధ రచనల ద్వారా పాత్రికేయులు సాధించవలసిన పరమార్థం ఈనాడు ఇదే. దీనికి సాహిత్య దర్శన సమన్వయం కావాలి.

ఆధ్యాత్మిక రచనలంటేనే అదో రకమయిన మొహం పెట్టే మహనీయులు ఈ రోజుల్లో ఎంతమందో ఉన్నారు. ఆధ్యాత్మికత అంటే ఏమిటో వాళ్ళకు తెలియకపోవటమే దీనికి కారణం. తలనెరసిన తర్వాత, కరచరణాదులు బలహీనమయి నీరసించిన తర్వాతగాని ఆధ్యాత్మికతను

(తరువాయి 38వ పేజీలో)

## శైలజా! ఈమె మా బామ్మగారు అన్నాడు చెయ్యి చాపి, సుమారు తొంబయి సంవత్సరాల వృద్ధురాలిని చూపిస్తూ కృష్ణ.

ఆ ఇరవై రెండేళ్ళ అందమైన అమ్మాయి చేపల్లాటి కళ్ళు ఆశ్చర్యానందాల్లో వెడల్పయ్యాయి. అలా వెడల్పయిన కనుల్లో నీరూరింది.

ఆ నీటితెర చూపులకు అడ్డురావటంతో రెప్పలు, రెండు మూడు సార్లు వాలి లేచేసరికి ముత్యాల్లా నీటి బిందువులు రాలాయి చెక్కులపైన.




చేతులెప్పుడు ముకుళించి నమస్కరించిందో ఆమెకు తెలియదు. తెల్లని పంచ, పసిమిఛాయ, ముడతలు పడిన ముఖం మెడలో తులసిదండ, చేతికి నల్లని కాశీతాడు. గది గడపలో ఆమెను చూడగానే ఆమె చేతులు రెండూ దగ్గరయి పోయాయి.

రామ్మా, రారా క్రిష్ణా వీధి గడపలోనే అమ్మాయిని నిల్చుండబెట్టేశావు ఇదేం మర్యాదరా అంటూ తాను లోపలికి నడిచింది తులశమ్మగారు.

జంకకు మామూలుగా ఫ్రీగా ఉండు భయంలేదు అన్నీ నే చూసుకుంటాగా, గుసగుసగా శైలజ చెవి దగ్గర అన్నాడు కృష్ణ.

గుంభ్రంగా తల ఊపిందామె.

అది తాటాకుల మిద్దె ఇల్లు. అయినా శుభ్రంగా ఉంది. నడవలో పాతకాలపు కొయ్యకుర్చీలు రెండు, ఒక బల్ల ఉన్నాయి.

కూర్చో అని ఓ కుర్చీ చూపించాడు శైలజకు కృష్ణ.

కూర్చుని పరిసరాల వైపు పరిశీలనా దృష్టితో మౌనంగా చూస్తూంది శైలజ.

హమ్మయ్య అని రెండు మైళ్ళు నడచివచ్చిన బడలికతో ఉస్సురని నిట్టూర్చి, కాళ్ళు రాసుకున్నాడు కృష్ణ.

అతన్ని చూసిన శైలజ రుమాలు నోటికి అడ్డంపెట్టుకు నవ్వింది.

ఎందుకు ? అడిగాడు కృష్ణ

ఇల్లు చల్లగా, గమ్మత్తయిన చీకటితో బాగుంది అంది.

ఎండలో నడచి వచ్చాంగా, అలాగే ఉంటుంది.

అహ అదికాదు స్మెల్ కూడా.

అధిక్షేపణా !

సారీ కాదు. కాదు. నాకేదోలా చాలా బాగుంది. పట్నం రొద, కలుషితమైన గాలి, కృత్రిమమైన బేషజాలు, ఈ గది ముందు ఎయిర్ కండిషన్ రూమ్ ఎందుకు పనికి వస్తుంది ? అంది శైలజ.

ఇది మా స్వగ్రామం. వచ్చిందిగా ! కాళ్ళు నెప్పులు పెట్లా ! అడిగాడు కృష్ణ చిన్నగా నవ్వుతూ.

ఒరె కిష్టుడూ ! పిలిచింది తులసమ్మగారు.

బామ్మా! అంటూ, ఆమె ఉన్నచోటుకి వచ్చాడు కృష్ణ.

ఆ పిల్లను కాళ్ళూ చేతులూ కడుక్కుని కాసిని మంచి నీళ్ళు తాగనిస్తావా? ఆ కబుర్లేవిట్రా! మగపిల్లల్ని తీసుకు వస్తున్నావు నీ ఊరు చూపించాలని బాగుంది కాని, హవ్వ ఆడపిల్లని వెంటేసుకొచ్చావేమిట్రా అంతదూరం నడిపించి. అనేసి బుగ్గలు నొక్కుకుని మనవడివైపు ఆశ్చర్యంగా చూసింది తులసమ్మగారు.

అవును అతిథి మర్యాద చెయ్యాలి కదూ! అని శైలజ కూర్చున్న వైపు నడిచాడు కృష్ణ.

కాళ్ళు కడుక్కుని తులశమ్మగారిచ్చిన మంచినీటి గ్లాసు అందుకుని కొద్దిగా నీళ్ళ గ్లాసు ఎత్తి నోట్లో పోసుకు తాగింది శైలజ.

అమ్మాయ్ నీపేరు? తులశమ్మగారి ప్రశ్న

శైలజ

బాగుంది పేరు - అంటే పార్వతిదేవి పేరన్నమాట అని ఆమె వైపోసారి నఖశిఖ పర్యంతం చూసి పలుచని పవిట చాటున మెరిసే మంగళసూత్రాల వైపు చూసి బుగ్గలు నొక్కేసుకుంటూ! ఎంత తెగువమ్మా ఈ కాలపు పిల్లలకి అని మనసులోనే అనేసుకుని, మీ ఆయన్ని కూడా తీసుకురావాల్సింది - పిల్లలా తల్లీ! అడిగింది తులశమ్మ గారు.

కృష్ణ ముఖంలోకి చూసింది శైలజ జవాబేమివ్వా లన్నట్లు!

ఇంకా పిల్లలులేరు బామ్మా! వచ్చే సంవత్సరం ఏమో! అని కొంటెగా శైలజ వైపు చూశాడు కృష్ణ.

పోండి సిగ్గుపడింది శైలజ

అతను కూడా వస్తే బాగుండేదా! ఏం కాలమో! మా కాలంలో అయితే పరాయి మగాడి వైపు చూస్తే చాలు మనువుకి నీళ్ళొదిలి పోయేవి, అనేసి నువ్వోసారి ఇలా రారా కృష్ణా అని వంట ఇంటి వైపు నడిచింది తులశమ్మ గారు.

ఆమెను అనుసరించాడు కృష్ణ

ఆ పిల్ల ఏ కులందిరా! అడిగింది తులశమ్మ నెమ్మదిగా

మన కులవే!

వెధవా! బుద్ధిలేదూ పెళ్ళయిన పిల్లని అలా వెంటేసుకు రావచ్చా! పిల్ల నాజూకుదిలా ఉంది. సున్నుండ, చక్కిలం ఫలహారం పెడితె బాగుంటుందా? అనడిగి, కాఫీకి పాలు లేవన్నట్లు చెయ్యూపింది తులశమ్మ.

ఫలహారానికేం-బ్రహ్మాండం ఇవ్వు, తిని రామ కోవెల వైపు వెళ్ళి వస్తాం అన్నాడు కృష్ణ.

రెండు ప్లేట్లలో రెండేసి చక్కిలాలు, రెండేసి సున్నుండలూ పెడుతూ నువ్వు ఉత్తరం వ్రాశావు గదరా వస్తానని, చేసి ఉంచాను. అని అతని చేతిలో ప్లేట్లుంచింది తులశమ్మ గారు.

గబగబా తినేసి బామ్మా వెళ్ళి వస్తాం. గాబరా పడకు ఉత్త చారు అన్నం చెయ్యి చాలు అని తులశమ్మగారికి చెప్పి వీధి గడప దాటాడు కృష్ణ.

వీధి వాకిలి వరకూ వారి వెంట నడచిన తులశమ్మగారి చేతులు మరోసారి బుగ్గలు నొక్కుకున్నాయి. ఎంత మంచి స్నేహితుడయినా పరాయి మగాడి వెంట పెళ్ళాన్నెవరన్నా పంపేస్తారా? ఆ పిల్లకేం బుద్ధిలేదో! కిష్టిగాడ్ని అలా రాసుకు రాసుకు తిరుగుతూంది. తన ఊసు నాకెందుకు కానీ ఈ వెధవాయికి చెప్పాలి బుద్ధి అనుకుంటూ లోపలికి నడిచింది.

వంట పంచాదిలో ఉన్న పొయ్యిలో నాలుగు కట్టెలు పెట్టి పొరుగింటి సుబ్బాయమ్మ ఇంటికి నిప్పు తేవటానికి వెళ్ళింది తులశమ్మ.

ఎవరా అమ్మాయి వదినా! మనవడు వచ్చినట్టున్నాడు! అడగనే అడిగింది సుబ్బాయమ్మ. ఆమె అలా అడుగుతుందని ముందే ఊహించుకున్న తులశమ్మ నిప్పుకి వాళ్ళింటికి వెళ్ళకూడదనుకుంది. కాని ఏవిటో మనసు బాగోక అలవాటుగా వెళ్ళింది. అది పూర్వపు రోజుల్లో శ్రోత్రియ బ్రాహ్మణులతో కలకలలాడిన అగ్రహారం. పంటలులేక భుక్తులు గడవక కడుపుచేత పట్టుకుని ఊరు వదలిపోయిన వాళ్ళు పోగా ఐదారు కొంపల వాళ్ళు మిగిలారు.

వాడి పెళ్ళాం ఫ్రెండట, అనేసి మరి నిలవకుండా నిప్పు తీసుకుని బయలుదేరిపోయింది తులశమ్మ.

పొయ్యిలో నిప్పువేసి ఊదింది విసిరింది. మంట రాలేదు పొగ వచ్చింది. కళ్ళు మండాయి నీరు చిమ్మాయి. బొడ్డున దోపిన పవిట చెంగులాగి నీరు వత్తుకుంటూ అనుకుంది. ఇంకెన్నాళ్ళులే ఈ బాధ. గేస్ పొయ్యి వస్తుంది అని.

భూములమ్మి దొనేషను కట్టి మనవణ్ణి బి. ఇ. చదివిస్తుంది నాలుగేళ్ళూ. నాలుగు నెలలు పోతే వడ్డెక్కిపోతాయి. బోలెడు సంబంధాలు వస్తున్నాయి ఏబయి వేలు

## మార్పు

దీప్తజ్ఞానం కోసం
వేగిర పడ్డాడు
ఆనాటి మానవుడు
గుప్తజ్ఞానం కోసం
వేడుక పడుతున్నాడు
ఈనాటి మానవుడు !

— కె. కిశోరుబాబు

ఆరవయి వేలు ఇస్తామని! ఎందుకివ్వరు? ప్రతి సంవత్సరం ఫస్టు రాంకులో ఉన్నానని చెబుతున్నాడు. ఆ రాంకులేవో తనకు తెలియవు కాని పిల్ల నిచ్చుకునే వాళ్ళకు తెలియవూ! తను మాత్రం అస్థులమ్మి చదివించటానికి ఎందుకు తెగించింది? ఆ నష్టం కట్నంతో బర్తీ ఆయిపోతుందనే కద! ఉత్త కట్నం పారేసి చెయ్యి దులుపుకుంటామంటె ఊరుకోదు. పిల్లకు సంసారమివ్వమంటుంది. అప్పుడు గేస్ పొయ్యి, గ్రయిండరు, ఫ్రిజ్, స్టీలు సామాన్లు అన్నీ అమరుతాయి. అప్పుడు నిమిషంలో వెధవ వంట వండి పారేస్తుంది. ఈ పొగ కళ్ళమంట ఎంతకాలమై భరిస్తూంది! ఈ అగ్రహారంలో అడుగు పెట్టినది మొదలు. కసిగా కట్టె దులిపి పొయ్యి మంటలో పెట్టింది తులశమ్మ.

ఆమెకు ఇలాటి సదుపాయాలన్నీ ఉంటాయని డబ్బుకి చెయ్యి ఇరుకున ఉన్న రోజుల్లోనే తెలిసింది. బాగా ఉన్న బంధువుల ఇంటికి వెళ్ళినప్పుడు చూసింది. అబ్బ ఎంత అదృష్టం! గుండెల మీద చెయ్యుంచుకుంది. అప్పుడే అనుకుంది. ఇవన్నీ మనవడు ఇంజనీరయితే అవే నడిచి నట్టింట పడతాయని.

పొయ్యి మంటపెట్టి వంట చేస్తూంది కాని ఆమె మనస్సు గతం వర్తమానం భవిష్యత్‌లోనే పరుగులు తీస్తూంది.

అష్టవర్షే భవేత్‌కన్యా, అని తనకు ఎనిమిదో ఏడు వచ్చింది. మేనమామ తనను ఎవరు అడిగితే వారికిచ్చేసే ఉద్దేశంలో ఉన్నాడు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న తనకు మేనమామగారిల్లు శరణ్యమయింది. ఆ ఇంట్లో ఎవరే పని చెబితే అదిచేసి ఎవరేమి పెడితే అది తిని బుద్ధిగా ఉండే పరిస్థితి తనది. తనేమీ అడగ కూడదు, అదొక అంక్ష.

అలా బ్రతుకుకీడుస్తున్న రోజుల్లో ఓనాడు

వీధిలో తోటి పిల్లలతో చెమ్మచెక్కలాడుకుంటూన్న తనకు పిలుపు వచ్చింది పెరటి తోవన ఇంటికి రమ్మని.

ఇంట్లో అడుగుపెట్టగానే మేనమామ భార్య తలమీద రెండు మొట్టింది. ఏబ్రాసి ఎప్పుడూ ఎంగిలి ముండలా ఉంటావు, అంటూ. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

జడ అల్లి ముఖం కడుక్కోమంది. అలానే చేసింది.

తర్వాత తలలో ఎఱ్ఱ గన్నేరు పూలదండ ముడిచి ముఖాన్న బొట్టుపెట్టి కొత్త లంగా పండగకి కుట్టించినది వేయించి తన మెడలో ఉన్న గిలకసరి కాసులపేరు వేసి, చేతికి ఎప్పుడు గాజు లేయించినా ఉంచుకోదు ముండ అని మరో మొట్టికాయ మొట్టింది అత్త. తను తలమీద చెయ్యుంచుకుంది బాగా నెప్పిపెడితే.

అప్పటికే ఇంటి నిండా చేరిన ముత్తయిదువుల్లో ఒకామె గాజులు గుత్తంగా వేయించు వదినా అంది.

పిల్ల బొమ్మలా ఉంటుంది. సంబంధం కుదిరి పోవచ్చు.

బాగా ఉన్నవాళ్ళేట

బలరామయ్య అడిగినంతా ఇస్తారు.

వాళ్ళ ఆస్తంతా అడిగేస్తాడు మేనగోడలికి.

కిచకిచ నవ్వులు

పాపం పెళ్ళికొడుకు ముదరువాడే

ఎన్నేళ్ళుంటాయేమిటి?

ముప్ఫయిమేళ్ళ పయినే

పాపం ఎవరిదో సానుభూతి.

గోడకి చేరబడి తలొంచుకు నిల్చున్న తన చెవుల పడిన మాటలివి.

సంబంధం వాళ్ళన్నట్లుగానే కుదిరిపోయింది. మేన మామ వాళ్ళ దగ్గర రొక్కం ఎంత పుచ్చుకున్నాడో తనకు తెలియదు కాని, తన మెడలో మాత్రం తను మొయ్యలేనంత బంగారం, కంటి పట్టెడ, నాను, కాసుల పేరు, కుత్తిగంట, చేతులకు మురుగులు, పగడాలు, రెండు వందల తులాల వెండి పళ్ళెంలో ఉంచి ఇచ్చారు. అందెలు కడియాలు, గొలుసులు, పాంజేబులు—అవన్నీ, మేనమామ కొన్ని, అత్తవారు కొన్ని తీసేసుకున్నారు. తగుమాత్రం నగలే తనవంటి మీద ఉండేవి. తర్వాత ఆ నగల విష యంలో వారూ వీరూ తగువులు పడ్డారు. ఫలితం తనింక మేనమామ ఇంటికి వెళ్ళలేదు. అటునుంచి తన నెవరూ చూడటానికి రాలేదు.

కోట విడిదిలో తన పక్కన కూర్చునే వరకూ అతనే తన భర్త అనుకోలేదు. అమ్మో ఇంత పెద్దవాడే. ఛీ నల్లగా బాగోలేడు అనుకుంది మనసులో. ఆ లేతవయస్సులో ఆమె ఊహించుకునే పచ్చగా అందంగా ఉండే పదహారేళ్ళ బాలాకుమారుని రూపం పెద్దలు వల్లెవేసే పతివ్రతాధర్మాలు చెరిపేశాయి.

పాడీ పంటగల ఇల్లు. వచ్చేపోయే చుట్టాలు, గొడ్డుచాకిరీ, రాటుదేలి పోయింది తులశమ్మ. అత్తగారు ఏపన్నా పనిలో తేడా, పాడాలొస్తే బుగ్గలు గిల్లేసేది. మావగారు జంకూ గొంకూ లేకుండా నోటికొచ్చిన తిట్లు తిట్టేవాడు. అప్పుడప్పుడు చెయ్యెత్తేవాడు మొగుడు. సరేసరి పడక గదిలో ప్రతిరోజూ కొట్టేవాడు. కారణమేమిటో తెలిసేది కాదు.

అత్తా, మామ, భర్త, కాలం చేసేసరికి చచ్చినవాళ్ళు పోగా ఇరవై యేళ్ళ కొడుకు మిగిలాడు. కాస్తంత ఆస్తి మిగిలింది. కాలం తిరగబడింది. కొడుక్కి కట్నం

లాంచనాలూ అంటూ వియ్యాలవారి దగ్గర చాలానే గుంజింది. కాని కోడల్ని బాగానే చూసుకుంది.

పట్టుమని పదేళ్ళున్నా నిండలేదు పచ్చని కాపురం బద్దలయింది. ప్రసవంలోనే పసివాణ్ణి వదిలి కోడలు కాలం చేస్తే కొడుకు మతి చలించి దేశాలు పట్టిపోయాడు.

తల్లిదండ్రులు కరువైన మనుమణ్ణి ప్రాణానికి ప్రాణంగా పెంచింది.

తులశమ్మగారి కనుకొలకుల్లో నీటి బిందువులు నిలిచాయి. తాను మొరడులా మిగిలింది చచ్చేవార్ని, పుట్టే వార్ని, మారే మనుషుల్ని, కాలాన్ని చూస్తూ.

ఆముదపు దీపపు వెల్తురులో పుట్టిన తులశమ్మకి శర వేగంతో వస్తూన్న అన్ని సౌకర్యాలూ చిత్రంగానే తోస్తు న్నాయి. కడుపు చలవని కార్తీక చంద్రుణ్ణి ఉపవాస ముండి పూజిస్తూంటే మానవమాత్రులు చంద్రమండల మంతా బుగ్గిబూడిద అని తేల్చేశారు.

ఏమిటో ప్రజలు నాస్తికులయిపోతున్నారు. నవ్వుకుంది తులశమ్మ అరటికాయ ముక్కల మీద కారంజల్లి పొయ్యి ఆర్పేస్తూ.

మడిబట్ట విప్పి మేకున పెట్టేసి మడత పంచ కట్టుకుని వీధి గుమ్మంలో కూర్చుంది తులశమ్మ. ఆమెకు చీకటి పడితే సరిగా దృష్టి ఆనదు. అందుకని వంటయినా ఫలహారమయినా తొందరగానే చేసేస్తుంది. ఆమె పక్క సుబ్బాయమ్మ వచ్చి కూర్చుంది.

ఒదినా ఇంజనీరుకి కట్నమెంత తీసుకోవచ్చంటావు? అదొక సలహాలా అడిగింది తులశమ్మ సుబ్బాయమ్మని.

ఎవరెంత తీసుకొనీ నువ్వు మాత్రం ఏభయి వేలకు తగ్గకు. ఇంజనీరంటే బీర్వాలూ, సోఫాలూ, ఫ్రిజ్‌లూ, ఫేన్‌లూ, వీడియో, రేడియో గట్ర ఇంటిహంగు లుంటా యిగా—అవన్నీ ఇవ్వగలిగే సంబంధమే చెయ్యి. ఉచిత సలహా పారేసింది సుబ్బాయమ్మ తన కలాటి మనవడు లేడే అని విచారించేస్తూ.

భేషయిన మాటన్నావు వదినా! చదువు ఉద్యోగం అవే అవుతాయి కాని రేపు మాఘమాసంలో ఏదో సంబంధం కుదెర్టించేస్తాను. లేకపోతే....అని మిగతా, పెదవులు దాటి రావోయే మాటలు మింగేసింది తులశమ్మ.

అవునన్నట్లు ఇందాక ఆ వచ్చిన అమ్మాయి ఎవరంటే వాడి పెళ్ళాం ఫ్రెండట అనిచెప్పి హడవిడిగా వెళ్ళి పోయావు, ఎవరాపిల్ల? నవ్వుతూ అడిగింది సుబ్బాయమ్మ.

అలా చెప్పానా? అని కళ్ళనీళ్ళ పర్యంతం నవ్వింది తులశమ్మ అన్ని ఆలోచనలు ప్లానులు మరచి. తర్వాత ఫ్రెండు పెళ్ళాంట అంది.

అదిగో నమ్మోయ్ మీ మనవడు వచ్చేస్తున్నాడు అని లేచి వెళ్ళిపోయింది సుబ్బాయమ్మ.

ఏం చూపించావా అమ్మాయికి? నవ్వబోతూ మనవణ్ణి అడిగింది తులశమ్మ.

ఏం లేదు కాస్సేపు రామకోవెల అరుగుమీద కూర్చొని వచ్చేశాం అంటూ లోపలికి వచ్చాడు కృష్ణ.

రాత్రి భోజనాలయి కూర్చునే వరకూ, తులశమ్మ మనవడితో పెళ్ళి గురించే మాట్లాడింది.

వినివిని బాంబు పేల్చినట్లు చెప్పేశాడు కృష్ణ

ఆ అమ్మాయి నాభార్య బామ్మా! అని

ఆ....నోరావలించి అదేవిట్రా నీ ఫ్రెండు? అన్న ఆమె కనుల నిండుగా నీరు.

ఫ్రెండు పెళ్ళాం నా వెంట ఎందుకొస్తుంది బామ్మా! రిజష్టరు మేరేజ్ చేసుకున్నాను అన్నాడు కృష్ణ తేలిగ్గా నవ్వేస్తూ.

తులశమ్మ నోటమాట రాలేదు. ఆమె కన్నీటిలో మూడు తరాల కథలు కదిలాయి. తన పెళ్ళి, కొడుకు పెళ్ళి, మనవడి పెళ్ళి.

ఆమె డైరీలో పేజీ తిరగబడింది.

కట్నం, కానుక, లాంచనాలు అంది తులశమ్మ రుద్ధ స్వరంతో.

అవేం లేవు, ఉత్త కాయితాల పెళ్ళి అనేశాడు కృష్ణ.

★★

భారతీయ విజ్ఞానం

# ఈ అనంత విశ్వసృష్టి ఎప్పుడు జరిగింది?

— కె. ఆర్. కె. మోహన్

ఆధునిక విజ్ఞానం అభివృద్ధి చెందకముందు పాశ్చాత్యదేశాలలో చాలామంది బైబిల్‌లో చెప్పబడిన విధంగా సృష్టి ఆరువేల సంవత్సరాల ముందు జరిగిందని భావించేవారు. 16వ శతాబ్దానికి చెందిన ఉషర్ అనే క్రైస్తవ మతాచార్యుడు యావత్ సృష్టి క్రీ. పూ. 4004 సంవత్సరం అక్టోబరు 26వ తారీఖున ఉదయం సరిగ్గా 9–00 గంటలకు జరిగిందని ముహూర్తం కూడా పెట్టేశాడు. ఈ భావనలను ఆమోదించని వారిని ప్రమాదకరమైన మతవిద్రోహులుగా చిత్రించి సజీవదహనం చేసేవారు. పాశ్చాత్యుల భావాలు ఇలావుంటే, విష్ణుపురాణం, భాగవత పురాణం వంటి ప్రాచీన గ్రంథాలలో ఇచ్చిన లెక్కల ప్రకారం భూమి 197, 29, 49, 087 సంవత్సరాల (1986 నాటికి) క్రిందట ఆవిర్భవించింది. ఈ సంఖ్య ఆధునిక భూభౌతిక శాస్త్రజ్ఞుల అంచనాలతో సరిపోవడం చూసి అచ్చెరు వందిన ఆర్థర్‌హోమ్స్ వంటి శాస్త్రజ్ఞులు ప్రాచీన హిందూ వైజ్ఞానికులకి జోహార్లర్పించారు. ఈ సందర్భంలో ప్రాచీనుల కాలప్రమాణం గురించి తెలుసుకోవడం ఆసక్తిని రేకెత్తిస్తుంది.

అత్యల్ప కాలప్రమాణాన్ని "ప్రాణ" అనేవారు

| | | |
|---|---|---|
| 6 ప్రాణాలు | = | 1 విఘటిక |
| 60 విఘటికలు | = | 1 ఘటిక |
| 60 ఘటికలు | = | 1 అహోరాత్రం (పగలు–రేయి కలిసినది) |
| 15 అహోరాత్రాలు | = | 1 పక్షం |
| 2 పక్షాలు | = | 1 మాసం |
| 12 మాసాలు | = | 1 సంవత్సరం (దేవమాసంలో ఇది 1 రోజు) |
| 30 మానవ సంవత్సరాలు | = | 1 దేవమాసం |
| 360 మానవ సంవత్సరాలు | = | 1 దేవ సంవత్సరం |
| 4800 దేవ సంవత్సరాలు లేక 17,28,000 మానవ సంవత్సరాలు | = | 1 కృతయుగం (సంధికాలంతో సహా) |
| 3600 దేవ సంవత్సరాలు లేక 12,96,000 మానవ సంవత్సరాలు | = | 1 త్రేతాయుగం (సంధికాలంతో సహా) |
| 2400 దేవసంవత్సరాలు లేక 8,64,000 మానవ సంవత్సరాలు | = | 1 ద్వాపరయుగం (సంధికాలంతో సహా) |

1200 దేవ సంవత్సరాలు లేక
4,32,000 మానవ సంవత్సరాలు = 1 కలియుగం (సంధికాలంతో సహా)
12,000 దేవ సంవత్సరాలు లేక
43,20,000 మానవ సంవత్సరాలు = 1 దివ్యయుగం లేక మహాయుగం
(నాలుగు యుగాల మొత్తం)

1000 దివ్యయుగాలు లేక
432,00,00,000 మానవ సం॥ = 1 ఉదయకల్పం (బ్రహ్మ పగలు)

మరి ఒక

1000 దివ్యయుగాలు లేక
432,00,00,000 మానవ సం॥ = 1 క్షయకల్పం (బ్రహ్మరాత్రి)
2000 దివ్యయుగాలు లేక
864,00,00,000 మానవ సం॥ 1 బ్రహ్మదివసం (అహోరాత్రాలు)
30 బ్రహ్మదినాలు బ్రహ్మమాసం
12 బ్రహ్మమాసాలు బ్రహ్మ సంవత్సరం
100 బ్రహ్మ సంవత్సరాలు బ్రహ్మ జీవిత కాలం

ఇది మానవ సంవత్సరాలలో ఎంతవుతుందో చూద్దాం.

1 బ్రహ్మదినం = 8,64,00,00,000
1 బ్రహ్మ సంవత్సరం = 864,00,00,000 × 360=31104000,00,000 సం.లు
1 బ్రహ్మ జీవితకాలం = 864,00,00,000 × 360 × 100=31104000,00,00,000 సం.లు

ఇంతకాలం గడిచేసరికి యావత్ సృష్టి గాలక్సీలు, నక్షత్రాలు, గ్రహాలూ అన్నీ నశించిపోతాయి. 100 బ్రహ్మ సంవత్సరాలు ఇలా లయంలో గడిచాక, మళ్ళీ సృష్టి ప్రారంభమవుతుంది. ఇది అనంతంగా సాగుతుంటుంది.

ప్రస్తుతం బ్రహ్మకి 50 దివ్య సంవత్సరాలు గడిచి, యాభైయ్యొకటో సంవత్సరంలో 197, 29, 49, 087 (1986 కి) సంవత్సరాలు గడిచాయి. అంటే ఈ విశాల అనంతవిశ్వం పునఃసృష్టి జరిగిందెప్పుడో చూద్దాం.

1 దివ్యసంవత్సరం = 8,64,00,00,000 × 360 మానవ సంవత్సరాలు
50 దివ్య సంవత్సరాలు = 50 × 864,00,00,000 × 360=15552000,00,00,000 సం. లు.

దీనికి 197, 29, 49, 085 కలిపితే 155 521 972 949 0887 (1986 కి) వస్తుంది.

ఇంత కాలానికి ముందు ఈ అనంతవిశ్వపు పునఃసృష్టి ప్రారంభమైనదన్నమాట. అత్యాధునిక సాధనాలతో కూడా సాధించలేని ఈ అంచనాలను ప్రాచీన భారతీయులు ఎలా నిర్దుష్టంగా లెక్కించగలిగారో వారికే తెలియాలి. వారి మేధస్సుకు జోహార్లు అర్పిస్తూ వారినుంచి స్ఫూర్తిని పొందడం కంటే మనం చేయగలిగింది వేరేమీలేదు. ★

## మానవాకారం
# మానవత్వానికి లక్షణం కానేరదు

మానవుని విలువ ఎక్కడ ఉంటుంది? గుణములో ఉంటుంది. గుణమున్న వానికే స్థలమున్నది లోకములో. లోకములో ఇంతమందికి స్థలమున్నది గదా ! గుణవంతులకు మాత్రమే కాదే! గుణవంతుల కంటె గుణహీనులే అధికంగా ఉంటున్నారే అని మీరు భావించవచ్చు. కానీ, అందరూ మానవులు కారు.

### శ్రీ సత్యసాయిబాబా

"ఆకుపచ్చ పక్షులన్నీ చిలుకులవలె పలుకునా?
పువ్వులపై పారాడు పురుగులు తుమ్మెదలగునా?
ఏనుగంత బలిసియున్నా పంది ఏనుగగు
నటయ్యా?"

కాదు, కాదు. మానవాకారం మానవత్వానికి లక్షణం కానేరదు. పవిత్రమైనటువంటి చరిత్రను అనుభవంలోనికి తెప్పించుకొని, సుగుణములు పోషించుకొన్నటువంటి వాడే, శీలమును కాపాడుకొన్నటువంటి వాడే, త్యాగమును అభివృద్ధి పరుచుకొన్నటువంటి వాడే నిజమైన మానవుడని ఇక్కడ శ్రీరామచంద్రుడు ఆదర్శంగా నిరూపిస్తూ వచ్చాడు.

దీనినే ఆధారం చేసుకొని, నేను అప్పుడప్పుడూ క్రొత్తక్రొత్త పిల్లలకు ఒక ఉదాహరణ చెప్తుంటాను. మీరు వాచ్ ( Watch ) వేసుకున్నారు. ఇది అయిదు అక్షరములతో ఉంటున్నది. దీనిని మీరు, గంటలు మాత్రమే చూచి, అలంకారంగా పెట్టుకోటం కాదు.

"ఎడమచేతి కడాన రెండు తుంటల విల్లు
తోలు పట్టెడగట్టి యాలాడ గడతారు
ఏటి యేషాలప్ప ఇవి
ఇవి కంటితో చూచేటి కాని యవతారాలు"

ఇది కేవలము అలంకారము కోసం కట్టుకోటం కాదు. అలంకారంతో పాటు మన గుణములను కూడా పోషించుకోటానికి ప్రయత్నం చేయాలి. గడియారము కూడను, ఒక ఆదర్శవంతమైన జీవితాన్ని సూచిస్తుంటుంది. మనము దీనిని మొట్టమొదట పంచప్రాణములుగా భావించాలి. ఇది పంచాక్షరములతో ప్రబోధ చేసేటటువంటి పవిత్రమైన మంత్రంగా ఉంటుంది. దీని మొదటి అక్షరము 'W'

'W' = Word — "Watch your Word"

నీ యిష్టము వచ్చినట్లు వాగొద్దు. నీవు చెప్పేటటువంటి ప్రతిపదమును కూడను వాచ్ (Watch) చెయ్యి. ఇక రెండవది 'A'

'A' = Action — "Watch your Action"

నీ ప్రవర్తనను సరియైన హద్దులోపలే పెట్టుకొని సక్రమమైన మార్గంలో దింపడానికి చూచుకోవాలి. ఇంక మూడవది 'T'

'T' = Thought — "Watch your thought"

నీయొక్క ఆలోచనను మంచిమార్గంలో ఉంచుకోవాలి. ఇంక నాల్గవది 'C'

'C' = Character — "Watch your Character"

నీయొక్క శీలమును కాపాడుకో. ఇంక ఐదవది 'H'

'H' = Heart — "Watch your heart"

నీయొక్క హృదయమును పరిశుద్ధముగా ఉంచుకో.

పంచ ప్రాణములైన ఈ పంచాక్షరములను మీరు సక్రమముగా పాటించితే, పరమాత్మ మీకు అక్కడే ప్రత్యక్షమవుతాడు. ఈ ఐదింటిని విచ్చలవిడిగా బజారు వెంట విడిచిపెట్టి, ఏదో మృగలక్షణంగా, లేక మృగ ప్రవర్తనతో సంచరిస్తే నిజంగా వారిని మానవులని చెప్పడానికి వీలుకాదు. కనుకనే మానవధర్మమును నెరిగినటువంటి వాలిని మానవునిగా విశ్వసించి, రాముడు అతనిని శిక్షించడానికి ప్రయత్నించాడు. కనుక, మనము ఆకారమును ప్రధానముగా భావించకూడదు. అందులో ఉన్నటువంటి ఆత్మ తత్వమును ప్రధానంగా తీసుకోవాలి. ★

# జాజికాయ

యస్. యన్. దుర్గారావు

ఇది గుల్మ జాతి మొక్క. సుమారు గజమెత్తు వరకు పెరుగును ఇది మళయాళ దేశంలో జావా, పినాంగ్‌లలో అధికముగా పైరగును. ఆకులు కొనగా ఉండి మధ్య ఈనెలు కలిగి తొగరాకుల వలె నుండును. పువ్వు ఎరుపు వర్ణము గలిగి, గుత్తులు గుత్తులుగా నుండును. కాయ అల్ల నేరేడు పండును పోలియుండును. కాయ లోని గింజపై గట్టి పెంకు గట్టిన కవచము ఉండును. దానిపై మరో కవచముండును. దీనికే జాపత్రి (MACE) అని పేరు. ఇది చమురు గల పదార్థము. సువాసన కలిగి యుండును. కాయ బాగా ముదిరితే జాపత్రి పచ్చ బడుతుంది. బాగా ముదిరిన జాజికాయ కదిపిన మ్రోత వచ్చును. దీనిలో చమురు, క్రొవ్వు, పిండి పదార్థము, మత్తు కల్గించు పదార్థములు కలవు. దీని సంస్కృత నామధేయాలు :

జాతీఫలః, మదశౌండమ్.

ఇది వగరు, చేదు, కారము రుచులు మిశ్రమై ఉండును. విపాకమున కారపు రుచిగా మారును. త్వరగా శరీరమంతా వ్యాపించు శక్తి గలది. జఠర దీప్తిని కలిగించును. వేడి చేయును.

వైద్యములో జాజికాయకు, జాపత్రికి గుణములలో అంతగా భేదము లేదు.

## వైద్యవాణి

జాజికాయను బుగ్గన పెట్టుకొని ఊట మ్రింగుతున్న నోటి దుర్వాసన పోగొట్టును, కంఠ స్వరము బాగుగా నగును, దగ్గులు, వాంతులను హరించును ; జాజికాయ చూర్ణం వెన్నతో కలిపి రాసిన నోటి పూత తగ్గును: జాజికాయ చూర్ణము, కవిరి చూర్ణము సమముగా కలిపి పెరుగుతో త్రాగిన అతిసారము కట్టును ; జాజికాయ నీటితో గంధముగా అరగదీసి రాసిన పోతరపు మొటిమలు హరించును ; జాజికాయ గంధము, కరక్కాయ గంధము, నల్లమందు కలిపి కంటి చుట్టూ పట్టు వేసిన కంటి బాధలు నయమగును ; జాజికాయ, కందిగింజంత నల్లమందును గుంటగలగరాకు రసముతో అరగదీసి 6 మాత్రలు చేసి రాత్రి పరుండబోవునపుడు ఒక మాత్ర చొప్పున వేసుకుని పాలు త్రాగిన వీర్య స్థంభనము చేసి రతి సుఖము కల్గించును ; జాజికాయ నుండి తీసిన తైలము శిశ్నమునకు రాసిన లేపన శక్తి కల్గించును : దంతములలో వేసిన దంత బాధ నివర్తియగును ; ఆమ వాతము పోగొట్టును ;

### ఆంధ్ర పితామహ

# డాక్టర్ మాడపాటి హనుమంతరావు

నైజాం రాష్ట్రాంధ్రోద్యమ విధాతగా, సంఘ సంస్కర్తగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా, రాజకీయ వేత్తగా, కార్యదర్శిగా, న్యాయవాదిగా, వక్తగా, చరిత్ర పరిశోధకుడుగా, పండితుడుగా, ఆంధ్ర భాషోద్ధారకుడుగా, గ్రంథకర్తగా, కథకుడుగా, వ్యాసకర్తగా, పత్రికా రచయితగా, సంపాదకుడుగా, నిస్వార్థ సేవాతత్పరుడుగా, మహోన్నత ఆదర్శమూర్తిగా ఆంధ్రుల హృదయాల్లో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించిన ఆంధ్రపితామహ బిరుదాంకితులు, పద్మభూషణ డాక్టర్ మాడపాటి హనుమంతరావుగారు.

### డా॥ వి. సిమ్మన్న

డాక్టర్ రావుగారు ఆరువేల నియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. కౌశిక గోత్రికులు. వీరు కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పొకుకూరు గ్రామంలో 1885 తారణనామ సంవత్సర మాఘశుద్ధ షష్ఠి గురువారంనాడు అనగా జనవరి 22వ తేదిన జన్మించారు. తండ్రి వేంకటప్పయ్య, తల్లి వేంకటసుబ్బమ్మ. వేంకటప్పయ్య గారికి హనుమంతరావుగారు రెండవ సంతానం.

హనుమంతరావుగారి అక్షరాభ్యాసం సూర్యాపేటలో ప్రారంభమైంది. వీరు నల్లగొండ పాఠశాలలో 18[illegible]8 లో ఫసలీలో ఉర్దూమిడిల్ పరీక్షలోను, 1900 లో ఫసలీలో ఇంగ్లీషు మిడిల్ పరీక్షలోను ఉత్తీర్ణులయ్యారు. తర్వాత హనుమకొండలోని ఉన్నత పాఠశాలలో ప్రిమెట్రిక్, మెట్రిక్యులేషన్ పరీక్షల్లో పాసయ్యారు.

1904 లో గుమాస్తా ( మీర్‌మున్షి ) ఉద్యోగంలో చేరారు. కొంతకాలం 'సిరిషెదారు' పదవిని కూడా చేశారు. తర్వాత నిజాంరాష్ట్ర శాసన నిర్మాణశాఖలో ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగుభాషల్లో అనువాదకుడుగా అయిదు సం. లు. పనిచేశారు. ఈ అయిదు సంవత్సరాల్లో సువ్వందర్జా, దువ్వందర్జా, అవ్వల్‌దర్జా వకాలతు పరీక్షల్లో పట్టాలు పొందారు. శాసనసభలోని ఉద్యోగానికి రాజీనామా చేసి 1917 లో న్యాయవాద వృత్తిని చేపట్టారు. వీరు న్యాయవాద వృత్తిలో మంచిపేరు ప్రఖ్యాతలు గడించారు. అయినప్పటికీ డాక్టరు రావుగారు 1941లో ఆ వృత్తికి స్వస్తి చెప్పి ప్రజాసేవ చేయడానికి కంకణం కట్టుకున్నారు. ఈ నిర్ణయం వీరి జీవితంలో ఒక క్రొత్త మలుపును సృష్టించడమే కాక నిజామాంధ్ర ప్రజలకు స్ఫూర్తిని, దీప్తిని కలిగించింది.

డాక్టర్ రావుగారు తమ దృష్టిని ఆంధ్రభాషా వికాసోద్యమం, సంఘ సంస్కరణోద్యమం, రాజకీయోద్యమాలపై మళ్ళించి, వాటి కోసం జీవితమంతా ధారపోశారు.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, బాల సరస్వతీ యాంధ్రభాషా నిలయం, వేమన ఆంధ్రభాషా నిలయం మున్నగు సంస్థలకు సేవచేసి ఆంధ్రభాషా వికాసానికి మిక్కిలి తోడ్పడ్డారు.

వీరు యాదవ, ముదిరాజు, మున్నూరు హరిజన, పద్మశాలి, గౌడ మున్నగు బడుగు బలహీనవర్గాల వారిని మేల్కొల్పి చైతన్యవంతం చేశారు.

జీవరక్షా ప్రచారిణీ సంఘం, హిందూ సంఘ సంస్కార సభ, ఆది హిందూ సేవాసమితి సంస్థలకు చేయూత నిచ్చి, సంఘ సంస్కర్తగా పేరు గాంచారు.

శ్రీమతి యస్. సీతమ్మగారు నడుపుతున్న పరోపకారిణీ బాలికా పాఠశాలను వీరు తన ఆధీనంలోకి తీసుకొని స్త్రీ విద్య కోసం పాటుపడ్డారు. కందుకూరి తర్వాత మన

రాష్ట్రంలో స్త్రీ జనోద్ధరణానికి పాటుపడిన వారిలో డాక్టర్ రావుగారు ముఖ్యులు. అందుచేతనే శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు హనుమంతరావుగారి గూర్చి ఇలా అన్నారు. "హనుమంతరావుగారికి సమాజాలే సంతానం. మహాసభ ఒక పుత్రుడు. మహిళాసభ ఒక పుత్రిక. సోదరి సమాజం ఒక తోబుట్టువు. భాషానిలయం ఒక గారాల బిడ్డ. అందరికన్నా అనుంగుబిడ్డ ఆంధ్ర బాలికా పాఠశాల" ఇది నూటికి నూరుపాళ్ళు నిజం.

హనుమంతరావుగారి ప్రతిభ ఆంధ్రులేకాక, ఆంధ్రేతరులు కూడా గ్రహించారు. వీరి ఆదర్శాల్ని ఆచరణలో పెట్టడానికి ఎంతోమంది ప్రయత్నించారు. అందువల్లే డాక్టర్ రావుగారిని ఉద్దేశిస్తూ శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు ఇలా అన్నారు "వీరిలో ఒక గొప్ప లక్షణం కలదు. ప్రజా సేవకుల్ని, వ్రాయసకాండ్రను గుర్తించుటలో వీరికి పక్షి చూపు కలదు. అట్టి వారిని జారిపోదు మన్నను జారనీయక తమ దృక్పథమందే ఉంచుకొని ప్రోత్సాహపరచి రంగంలోనికి లాగుతారు. సహాయకుల్ని, అనుయాయుల్ని సిద్ధం చేసుకొనుట నాయక లక్షణాల్లో ఒకటి" ఇది వీరి మహోన్నతమైన వ్యక్తిత్వానికి గీటురాయి.

ఆంధ్ర జనసంఘానికి డాక్టర్ రావుగారు కార్యదర్శిగా కొన్నాళ్ళు పనిచేశారు. వీరి కృషి ఫలితంగా అనేక ఆంధ్ర జనసంఘాలు స్థాపించబడ్డాయి. కొంతకాలం తర్వాత ఆంధ్ర జనసంఘం వారు 'నిజాం రాష్ట్రాంధ్ర జన కేంద్ర సంఘం' స్థాపించారు. ఈ కేంద్ర సంఘం ద్వారా వీరు చేసిన మేలు చెప్పనలవి కాదు.

1951 ఏప్రిల్ 15వ తేదీన హైదరాబాదు పురపాలక సంఘానికి డాక్టర్ రావుగారు మేయరుగా ఎన్నుకోబడటం చెప్పుకోదగ్గ విశేషం. వీరికి 1955 లో భారత ప్రభుత్వం పద్మభూషణ బిరుదునిచ్చి సత్కరించింది. 19'6 లో ఉస్మానియా యూనివర్సిటీ డాక్టరేటు బిరుదునిచ్చి గౌరవించింది.

డాక్టర్ రావుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. వీరి సాహితీ కృషి ప్రశంసించదగ్గది. మల్లికాగుచ్ఛము, మాలతీ గుచ్ఛము, క్షాత్రకాలపు హిందూవార్యులు, తెలంగాణా ఆంధ్రోద్యమము మొదలగు గ్రంథాలు ముద్రితమైనాయి. అముద్రితంగా గ్యారిబాల్డి చరిత్రము, మహాభారత సమీక్షణము, తెలంగాణా ఆంధ్రోద్యమము మున్నగు గ్రంథాలున్నాయి. 'రోమన్ సామ్రాజ్య చరిత్రము' అసంపూర్ణంగా ఉండిపోయింది. "నిజాంరాష్ట్రంలో రాజ్యాంగ సంస్కరణలు" అనే గ్రంథాన్ని ఇంగ్లీషు నుండి అనువదించారు.

వీరు పదమూడు కథానికలు వ్రాసి కథానిక సాహిత్యానికి వన్నె తెచ్చారు. హృదయ శల్యము, రాణీ సారంధా, ముసలిదాని యుసురు, నేనే, అగ్నిగుండము, నాడు నీ పంతము–నేడు నా పంతము, ఆత్మార్పణము అనే ఏడు కథల్ని మచిలీపట్నం సరస్వతీ నికేతనం వారు ప్రచురించారు. విధిప్రేరణము, ఎవరికి? అనే రెండు కథల్ని ఆణా గ్రంథమాల వారు ప్రకటించారు. న్యాయమా?, ఎవరిది తప్పు, ఇక కావలసినదేమి?, నిజమేనా? అనే నాలుగు కథలు భారతి, శారద, సుజాత పత్రికల్లో ప్రచురించబడ్డాయి.

హనుమంతరావుగారు అనేక రాజకీయ, ఆర్థిక, సామాజిక, చరిత్ర, సాహిత్య వ్యాసాల్ని వ్రాసి వ్యాసకర్తగా పేరు పొందారు.

పత్రికా రచనలో వీరు సిద్ధహస్తులు. నీలగిరి పత్రిక, తెనుగు పత్రిక, గోల్కొండ పత్రిక, సుజాత, దేశబంధు మొదలగు పత్రికలు వీరి కృషి ఫలితంగా అభివృద్ధి చెందాయి. పత్రికల్ని నడపడమే కాకుండా, ఇతర పత్రికలకు వ్యాసాలు వ్రాసి ఆ పత్రికలకు కూడా మంచిపేరు తెచ్చిపెట్టారు.

డాక్టర్ రావుగారు ఆంధ్ర, ఆంగ్ల, హిందీ, ఉర్దూ, పారసీ భాషల్లో ఆరితేరిన దిట్ట. ఏ భాషలోనైన ధారాళంగా ఆకర్షణీయంగా ఉపన్యసించగల మహావక్త.

వీరి అముద్రిత గ్రంథాలు, వ్యాసాలు ముద్రణకు నోచుకుంటే ఈ జాతి అయన ఋణంతీర్చుకొన్నట్లు అవుతుంది.

ఈ విధంగా తన జీవితాన్ని త్యాగంచేసి అహర్నిశలు ఆంధ్రుల కోసం పాటుపడి, ఆంధ్ర జాతికి అఖండ తేజస్సు నొసగిన మహోన్నత వ్యక్తి డాక్టర్ మాడపాటి హనుమంతరావుగారు. ★

# మా ప్రిన్సిపల్

మైసూరు విశ్వవిద్యాలయంలో ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గా వుండి, కన్నడ విద్యార్థుల మన్నన అందుకొన్న దేశికోత్తములు ఆచార్య శ్రీ బి. యం. శ్రీకంఠయ్య. విద్యార్థుల నెంతగానో ప్రేమించేవారాయన. తమ విద్యాభ్యాసం నాటి అనుభవాలను వివరిస్తూ ఒక సంఘటనను చెప్పారు.

**జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

ప్రొఫెసర్ కుక్ బెంగుళూరు సెంట్రల్ కాలేజి ప్రిన్సిపల్‌గా వుండేవారు. కాలేజ్ అంటే ఆయనకు పంచప్రాణాలు. విద్యార్థులకు ఆయనంటే భయం అంతకంటే భక్తి ఎక్కువగా వుండేది. అవి పరీక్ష జరిగే రోజులు. ప్రిన్సిపల్ రాత్రి వేళల్లోను, తెల్లవారుఝామున విద్యార్థులు చదువుతున్నదీ లేనిదీ గమనిస్తూ రహస్యంగా సంచారం చేసేవాడు.

తెల్లవారితే ఇంగ్లీష్ ఫస్ట్ పేపర్. బి.ఏ తరగతి విద్యార్థులున్న హాస్టల్‌కు చేరువగా ఆట స్థలం. వెండిలా మెరిసే వెన్నెల రాత్రి అది. హాస్టల్ లోని కొందరు విద్యార్థులు మైదానంలో కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుతూ నవ్వులాడుతూ వున్నారు. రాత్రి 12 గంటలు కావస్తుంది. అకస్మాత్తుగా ప్రిన్సిపల్ విద్యార్థుల వద్దకు వచ్చారు. అంతకు ముందు అతని రాకను గమనించిన కొందరు విద్యార్థులు పరుగు తీశారు. నేను, మరో నలుగురు లేచి నిల్చున్నాం.

"అర్థరాత్రి కావస్తున్నా ఏమిటి మీ కబుర్లు తెల్లవారితే పరీక్షలున్నాయి కదా?" అన్నాడు.

"సర్, ఇందాక చదివాం. చల్లని వెన్నెల్లో కూర్చుని చదివిన విషయాలను చర్చించుకుంటున్నాం" అన్నాను.

"అయితే మీ మిత్రులు పరుగు తీయటం ఎందుకు?"

"మీ రాకను గమనించి భయపడి పారిపోయారు" అన్నాను.

ఆయన నవ్వుతూ, 'చల్లని వెన్నెలలో మీతోపాటు కూర్చుని కబుర్లు చెప్పుకోవాలనే ఆశ నాకు లేకపోలేదు. అందుకోసమే వచ్చాను. రండి' అన్నారు ప్రిన్సిపల్.

మాతో కాసేపు మాట్లాడి జోకులతో మమ్ములను కవ్వించి, "అలా చదివిన తర్వాత చర్చించుకోవాలి. మీరందరూ తప్పక పాసవుతారు. పరీక్షలంటే భయపడటం అనవసరం. గుడ్ నైట్" అంటూ వెళ్ళిపోయారాయన.

తమ విద్యార్థులను కూడా అదే విధంగా ప్రోత్సహించి విద్యార్థులలో ఆంగ్ల సాహిత్యాభిరుచిని పెంపొందించిన దేశికోత్తములు ఆచార్య బి. యం. శ్రీకంఠయ్య.

అలాంటి ఆచార్యులు యీనాడు అరుదయ్యారు.

## మనస్సు

పలు రకాల కోరికల్నీ
ప్రయాణీకుల్లా
క్రిక్కిరిసేలా
ఎక్కించుకొని,
సమయంతో
పని లేకుండా
సాగుతున్న...
మన మనస్సు
ఒక ఆర్డినరి బస్సు

- వాసాల నరసయ్య

సారధికి ముచ్చెమటలు పోశాయి.

"నువ్వు...నువ్వు..." అన్నాడు నిలువు గుడ్లేసుకుని.

"అదేమిటలా అయిపోయారు? ఇంతకుముందే జయంత్‌గారు మీకు తెలుసా? తెలియదన్నారుగా?" గబగబా అన్నాడు శాంతారామ్.

జరిగిన కథ

బాబుని చూసిన చందనకి ప్రాణం లేచొచ్చింది. ఆప్యాయతగా దగ్గరకు తీసుకొని యోగక్షేమాలు విచారించింది. ఎలా బయటపడాలా అన్నది ప్రస్తుతం ఆమె ఆలోచన. సారధి తను చేసిన పనికి సిగ్గుపడి శాంతారామ్ గారికి అసలు విషయం చెప్పాడు. పోలీసులతో అక్కడికి వెళ్ళాలన్నాడు. వారింట్లో బాబుకి తండ్రిగా పరిచయం చేసిన జయంత్‌ని చూసి కొయ్యబారిపొయ్యాడు సారధి.

(ఇక చదవండి)




సారధి మాట్లాడలేదు .... ఇంకా అలా విశ్చేష్టుడైనట్టు నిల్చుండిపోయాడు.

"ఏమిటిలా వచ్చావ్?" కఠినంగా అన్నాడు జయంత్. అతని ప్రశ్న వినిపించలేదు సారధికి. శాంతారామ్ "ఈయనే బాబు తండ్రి" అన్న మాటలే చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

"బాబు .... బాబు .... ఈయన కొడుకా?" అప్రయత్నంగా అన్నాడు.

"అవును! బాబుని వెతకడానికే ఆయనిక్కడికొచ్చారు!" అన్నాడు శాంతారామ్ అతని ప్రవర్తన అర్థంకాక తెల్లబోతూ.

సారధి మొహం మరింత పాలిపోయింది.

"నిజంగా .... బాబు నీ కొడుకా?" అన్నాడు.

"అవును! ఏం" మొహం చిట్లించాడు జయంత్.

"మైగాడ్!" కుప్పకూలిపోయాడు సారధి.

"ఏమిటీ నాటకం?" అరిచాడు జయంత్.

"నాటకం కాదు జయంత్! ఘోరం జరిగిపోయింది!" దాదాపు ఏడుస్తున్నట్టు అన్నాడు సారధి.

"ఏమిటి?"

" ఏవిటండీ ! .... ఈ యన మీకింతకుముందే తెలుసా ? " కాస్త విసుగ్గా అన్నాడు శాంతారామ్.

" తెలుసు ! బాగా తెలుసు ! .... "

" మరైతే .... "

" ప్లీజ్ ! .... మీరొక్కసారి అలా వెళ్తారా ? " రెండు చేతులూ జోడించి అన్నాడు సారధి. ఆయన ఇద్దరికేసీ చిత్రంగా చూసి గదిలోకెళ్ళిపోయాడు.

" జయంత్ ! " అతని రెండు చేతులూ పట్టుకుని బావురుమన్నాడు సారధి.

" చెప్పు ! " గంభీరంగా అన్నాడు జయంత్.

" నేను. నేను ఘోర పాపం చేశాను. "

" అది నీ కలవాటేగా ! "

" అలవాటే జయంత్ ! నిజంగా నేనెన్నో ఘాతుకాలు చేశాను .... కానీ .... ఈ పని .... "

" నాన్చక చెప్పు ! " విసుక్కున్నాడు జయంత్.

" జయంత్ ....బాబుని నేనే నీ ఇంటి నించి ఎత్తుకెళ్ళి రాఘవ కప్పచెప్పాను ".

" వ్వాట్ ? " అదిరిపడ్డాడు జయంత్.

" అవును జయంత్ !....నేనే ఈ పాడు పనిచేశాను ! డబ్బుకి ఆశపడి వాణ్ణి నీకు దూరం చేశాను. కానీ వాడు నీ కొడుకని నాకు నిజంగా తెలియదు జయంత్ ! నా మాట నమ్ము ! " హటాత్తుగా అతని కాళ్ళ మీద పడిపోయాడు సారధి.

కొయ్యబారిపోయాడు జయంత్.

" నువ్వు మా ఇంటి కొచ్చావా ? " అన్నాడు పళ్ళ బిగువున కోపాన్ని ఆపుకుని.

" ఉఁహుఁ ! మీ ఇంటి కెదురుగావున్న పార్కులో బాబుని చూశాను. వాడు స్కూల్‌నించి వచ్చి ఇంటికి రాకుండా స్నేహితులతో కలిసి పార్కు కొచ్చాట్ట. స్నేహితులు వెంటనే వెళ్ళిపోతే, ఒక్కడే బాలాడుకుంటూంటే నేను కబుర్లు చెప్పి తీసుకొచ్చేశాను. కానీ తరవాత ఆత్మపరిశీలన చేసుకొన్నాను ! " అంటూ అంతా వివరంగా చెప్పి, తను అప్పుడక్కడికి ఎందుకొచ్చాడో కూడా చెప్పాడు సారధి.

నిర్ఘాంతపోయాడు జయంత్.

" ఇదీ ఒక నాటకం కాదు కదా ? " అన్నాడు అనుమానంగా చూస్తూ.

" నువ్వు అనుమానించడంలో తప్పులేదు జయంత్ ! నా చరిత్ర అలాంటిది ! కానీ ఇప్పుడు నేను చెప్పేది మాత్రం నూటికి నూరుపాళ్ళు నిజం ! ఏ ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను ! పదండి ! ముందు వాళ్ళని

రక్షించాలి! ఆ తరవాత నాకెలాంటి శిక్ష వేసినా అనుభవించడానికి నేను సిద్ధంగా వుంటాను!" అన్నాడు సారధి.

అతని మాటల్లో – నిజాయితీ గ్రహించిన జయంత్ ని

"అయితే ఇప్పుడేం చేద్దామంటావ్?" అన్నాడు.

"నేను వెళ్ళిపోతాను! ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. ఇంకా ఆలస్యం చేస్తే రాఘవకి అనుమానం వస్తుంది. మీరు పోలీసుల సహాయంతో రండి!" అంటూ వాళ్ళెలా రావల్సిందీ, ఎప్పుడు రావల్సిందీ చెప్పాడు సారధి.

"సరే!" అన్నాడు జయంత్.

సారధి పరుగులాంటి నడకతో బైటికొచ్చి సరాసరి బజారెళ్ళి పెళ్ళి క్కావల్సిన సరంజామా అంతా కొనుక్కుని అతి ప్రయాసమీద ఓ పురోహితుణ్ణి పట్టుకుని ఓ టాక్సీలో గమ్యం చేరుకున్నాడు.

టాక్సీ వెళ్ళిపోగానే....

"ఇదేవిటిక్కడికి తీసుకొచ్చారు?" పరిసరాలు పరికించి భయంగా అన్నాడు పురోహితుడు

"చెప్తాను! రండి!" అన్నాడతను శాంతంగా.

"చెప్తేగానీ రాను!" అన్నాడు పురోహితుడు.

"మీకేం భయంలేదు! ఇక్కడ మీరో పెళ్ళి చెయ్యాలి!"

"ఇక్కడా! పెళ్ళా?" మరింత బిత్తరపోయాడు పురోహితుడు.

"ఇక్కడే! మీకు చాలా డబ్బు ముడుతుంది. రండి!" సహనంగా అన్నాడు సారధి.

డబ్బుమాట వినగానే భయాన్ని వెనక్కినెట్టి లోపలికి నడిచాడాయన.

ఇద్దరూ కలిసి రాఘవ వున్న గదిలోకెళ్ళారు. రాఘవ బాగా తాగి వున్నాడు.

"అరె! ఏవిటి రాఘవా ఇది?" అతన్ని కుదుపుతూ అన్నాడు సారధి.

"పార్టీ!" నవ్వాడతను.

"పార్టీ? దానికిదా సమయం?" విసుగ్గా అన్నాడు సారధి

"మరెప్పుడేగా నా పెళ్ళి!" మళ్ళీ నవ్వాడతను. అయితే ఆ నవ్వులో ఆనందం లేదు! వైరాగ్యం వుంది!

మనసులోని అలజడిని మర్చిపోవడానికి తాగాడని గ్రహించాడు సారధి. ఎందుకో అతనిపట్ల అంతులేని జాలి కలిగిందతనికి.

"రాఘవా!" అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ మెల్లగా అన్నాడు.

"ఊఁ!"

"ఒక్కమాట చెప్తాను! వింటావా?"

"ఏమిటి సారధీ" ముద్దగా అన్నాడు రాఘవ.

"నా మాట విని ఈ పెళ్ళి మానెయ్యకూడదూ?"

"ఏవిటీ!" చివ్వున తలెత్తాడు రాఘవ.

"ఈ బలవంతపు పెళ్ళివల్ల నువ్వు సుఖపడేదేం లేదు! జరిగిందేదో జరిగిపోయింది. చందనని,

బాబుని వాళ్ళవాళ్ళకి అప్పచెప్పెయ్యి! వాళ్ళు మనల్ని తప్పకుండా క్షమిస్తారు!" అనునయంగా అన్నాడు సారధి.

తాగిన మైకంలో ఎఱ్ఱబారిన రాఘవ కళ్ళు ఆ మాటలతో మరింత ఎఱ్ఱబడ్డాయి. ఆతని చేతుల్లో వున్న తన చేతుల్ని విదిలించినట్టు లాక్కుని —

" ఇంతసేపుండి ! ఇన్ని మాటలూ విని ఇదా నువ్వు నా కిచ్చే సలహా ? " అన్నాడు కర్కశంగా.

" అది కాదు రాఘవా ! .... "

" ప్లీజ్ ! ఇంకేం చెప్పద్దు ! .... "

" కానీ .... "

" ఇంతకీ .... నేను చెప్పింది చేశావా లేదా ? " గద్దించాడు రాఘవ.

" తెచ్చాను ! "

" ఎక్కడ ? .... "

అతన్ని బైటికి తీసుకొచ్చి పెళ్ళి సరంజామా, భయంతో ఒణికిపోతూ నిల్చున్న పురోహితుణ్ణి చూపించాడు సారధి.

రాఘవ మొహం వికశించింది.

" వెరీగుడ్ ! .... " ఆతని బుజం తట్టాడు!

" మీరు .... మొదలు పెట్టండి శాస్త్రిగారూ ! " అన్నాడు సారధి.

" పెళ్ళికూతురేదీ ! " అన్నాడాయన ఒణుకుతున్న గొంతుతో.

" అదిగో ! ఆ గదిలో వుంది ! " వేలితో ఓ గదికేసి చూపించాడు రాఘవ.

" మరి .... కన్యాదాతలు ? .... " కాస్త ధైర్యం తెచ్చుకున్న పురోహితుడు గట్టిగానే అడిగాడు.

" కన్యాదాతలా ? " ఫక్కున నవ్వాడు రాఘవ.

ఆతని నవ్వుకు, తెచ్చుకున్న ధైర్యం పూర్తిగా సడలిపోయిందాయనకి.

" ఎక్కడో వెర్రి బ్రాహ్మడిలా వున్నావే ! ఇలాంటి పెళ్ళికి కన్యాదాతలు కూడా వుంటారా ? .... వూరికే మంత్రాలు చదివి ఆ మూడు ముళ్ళూ వేయించెయ్యండి ! చాలు ! "

" సరే ! .... రండి ! " మెల్లగా అన్నాడాయన గదిపైపుకి నడుస్తూ.

రాఘవ అనుసరించబోయాడు.

" అరె ! ఇలాగేనా ? బట్టలు మార్చుకోవూ ? " అన్నాడు సారధి.

" ఉహుఁ ! "

" ఛ ! ఛ ! అలా కాదు ! చెయ్యగలిగినవి కూడా మానడం ఎందుకు ? నేను పంచలు తెచ్చాను కట్టుకో ! "

" అవును ! కట్టుకోండి ! " అన్నాడు పురోహితుడు కూడ.

తప్పనిసరిగా సారధి ఇచ్చిన బట్టలు అందుకుని మరో గదిలోకి నడిచాడు రాఘవ.

వెంటనే గబగబా ఇవతలికొచ్చి, వీధిలో నిల్చున్న నౌకర్ని పిల్చి, రాఘవ ఏదో ఇన్స్ట్రక్షన్ ఇవ్వడానికి నౌకర్లందర్నీ అర్జంటుగా చివరి గదిలోకి రమ్మని చెప్పాడని

## పాల్కురికి సోమనాధుడు

రైటిస్టు విష్ణువును వదలి
లెఫ్టిస్టు శివుణ్ణి చేరి
సాహిత్య కమ్యూనిస్టుగా మారి
సామాన్యుడి కోసం పోరి
సమ సమాజ స్వప్నాలను కన్న
బసవన్నను కీర్తించిన
భక్త్యావేశ మహాంభోనిధి !
భావ బడబానల కీలల కవి జాతవేది !

—డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

డని చెప్పి తెలివిగా అందర్నీ ఓ గదిలోకి చేర్చి బైట గొళ్ళెం పెట్టాడు సారథి.

జరిగిన మోసం గ్రహించిన నౌకర్లు గోలగా అరవ సాగారు. అదేం పట్టించుకోకుండా ఒక్క అంగలో రాఘవ దగ్గరి కొచ్చాడతను.

రాఘవ పంచ కట్టుకుని వుత్తరీయం వేసుకున్నాడు. నుదుట బొట్టు పెట్టుకున్నాడు.

" పద !....అన్నాడు సారథి అతని చెయ్యి పట్టుకుని. తూలుతూనే బైటికొచ్చాడు రాఘవ. అప్పుడు అతనికి నౌకర్ల అరుపులు అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

" ఏమిటా గోల ? " అన్నాడు మత్తుగానే.

" నౌకర్లు ! వాళ్ళలో వాళ్ళే ఏదో తగూలాడుకుంటు న్నారు ! ఈ గోల మనకెందుకులే పద ! అవతల పురోహితుడు ఎదురు చూస్తున్నాడు ! తొందరపెట్టాడు సారథి.

అతని వుద్దేశం రాఘవని కూడా ఓ గదిలో బంధించి ఆపై మిగతా పన్లు చెయ్యాలని.

రాఘవ ఏదో గొణుక్కుంటూ గది దగ్గరికి నడిచాడు. తలుపు దగ్గరగా వేసుంది.

తలుపు తీశాడు సారథి. అయితే అతనాశించినట్లు వెంటనే రాఘవ లోపలి కెళ్ళలేదు లోపల ఎవరూ లేక పోడడంతో-

" అదేమిటి చందన ఈ గదిలోనేగా వుండాలి.... పురోహితుడూ లేడు ? " అన్నాడు రాఘవ ఏదో ఆలోచిస్తూ.

"బహుశా పెళ్ళికి ఈ గది విశాలంగా వుండదని మరోచోట అరేంజ్ చేశారేమో! నువ్వుండు నేను చూసొస్తాను!" అన్నాడు సారథి అనునయంగా.

చివరి గదిలోంచి కేకలు పెరిగాయి. రాఘవ కళ్ళు వింతగా ముడుచుకున్నాయి. ఏదో అనుమానం ప్రవేశించిందతనిలో.

వీధిలోకి తొంగి చూశాడు. అక్కడెవరూ లేరు.

సారథి వెళ్ళగానే ఒక్క పరుగున చివరి గదివైపు పరిగెత్తాడు.

లోపల అరుపులు ! బైట గొళ్ళెం ! అతని అను మానం బలపడింది. గభాల్న తలుపు గొళ్ళెం తీశాడు. అంతే ! వెల్లువలా వచ్చిపడ్డారంతా.

"ఏమిటి ? ఏం జరిగింది ?...."అన్నాడు అరచినట్టు.

" బాబుగారూ ! .... ఆ సారథిని నమ్మకండి ! .... ఆయన మమ్మల్ని మోసం చేసి ఇక్కడ బంధించాడు ! " అంటూ జరిగింది చెప్పారు వాళ్ళు.

రాఘవ మత్తంతా విడిపోయింది ! ఆవేశంతో పిడికిళ్ల బిగుసుకున్నాయి.

కళ్ళు మరీ నెత్తురు ముద్దల్లా మారాయి.

" రాస్కెల్ ! తిన్నయింటి వాసాలు లెక్క బెడ తావా ? నిన్ను క్షమించకూడదు .... " అంటూ పెట్టె లోంచి రివాల్వర్ అందుకుని హాల్లోకి పరిగెత్తాడు.

అంతే ! .... కొయ్యబారి పోయాడు రాఘవ. హాలు నిండా పోలీసులు ....

అందరి చేతుల్లోని ఆయుధాలు తనకేసే గురి పెట్టబడి వున్నాయి.

( స శే షం )



# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న, వాస్తుజ్యోతిష విద్వాన్

## కవితా కామేశ్వరశర్మ

అవనిగడ్డ - 521 121

**టి. యస్. ఆర్. కె. మూర్తి** — హైదరాబాదు

ప్రశ్న : నాకు ప్రమోషన్ వస్తుందా ? ఆకస్మికధన లాభం కల్గునా ? వర్తమానం శనిలో చంద్రుడు.

సమా : ప్రమోషన్ రావచ్చును. ఆకస్మిక ధనలాభం సంగతి అనుమానం కలిగితే వ్రాయండి సంతోషిస్తాను. మీతో బాటు అదేపనిగా లాటరీ టిక్కెట్లు కొనకండి.

**వేద వేదాంగవేత్త** — సికిందరాబాదు

ప్రశ్న : నాకు 71 సం॥ రాబోవుచున్నది. అపక్షయావస్థారంభ సమయం. శరీరధారణ జరిగిన తరువాత ఈ పరిణామములు అపరిహార్యములు. అసలు ఈ సంసార లక్షణమే ఇట్టిది. దీనికి ఎక్కువగా ఆందోళన పడి చేయజాలినదేమియు నుండదు. అంతయు దైవాయత్తము. నా జాతకచక్రమును వ్రాసి పంపుచున్నాను. పరిశీలించి నిస్సందేహముగ తెలుప ప్రార్థన.

సమా : తమకు ప్రస్తుతము గురుమహాదశ జరుగుచున్నది. 25-5-1991 వరకు ఉండును. యీ గురుదశకు ఆయుర్భంగ లక్షణములు లేవు పిమ్మట వచ్చు శనిదశ మారక లక్షణములు గలది. అందు నా స్వభుక్తిదోషము కాకపోవును. వాత సంబంధమగు అనారోగ్యము సూచితము. పిమ్మట వచ్చు బుధాంతరము ఆయుర్విషయమై ఆలోచనీయము. యీ భుక్తినుండి ఆరోగ్యము తగ్గి నడచును. అది వయోధర్మం కాదు. గ్రహచార ధర్మం. దశానాధుడగు గురువుకు (కుజ, శనుల) దృష్టి కలదు. ఉష్ణవాత సంబంధమగు అనారోగ్యము కాదగును. (ప్రస్తుతం) అరుచి-వాంతి లక్షణము పాదములకు ఉబ్బు ఉండవచ్చును.

**మామిడి శ్రీనివాసరావు** — బందరు

ప్రశ్న : నేను సెకండు ఇంటర్ చదువుచున్నాను. ప్యాసగుదునా ?

సమా : జాగ్రత్తగా-నిరుత్సాహం లేకుండా చదవండి. 3 అయినా ప్యాసవుతారు. లాంగ్వేజి జాగ్రత్త. పట్టుదలగా శ్రమిస్తే అత్తెసరు మార్కులతోనైనా ప్యాసవుతారు.

**కె. యస్. యస్. గుప్త బి. ఏ.** — రెండుచింతల

ప్రశ్న : నాకు ఉద్యోగం వస్తుందా ? ఎప్పుడు వస్తుంది ? నేను వ్యాపారంలో రాణిస్తానా ?

సమా : మీరు వ్యాపారంలో రాణిస్తారు. ఉద్యోగం తొందరలో వచ్చే సూచనలు లేవు. మొత్తం మీద రాకపోదు.

**షేక్ దస్తగిరి** — మచిలీపట్నం

ప్రశ్న : నా భవిష్యత్తు ఎలా వుంది ? ఉద్యోగం ఎప్పుడు వస్తుంది ?

సమా : మీరు మీ జాతకమును చక్కగా వ్రాసి పంపినందులకు అభినందనలు. జాతకం పంపువారు లేఖ వ్రాయు తేది. సమయము వ్రాయనక్కరలేదు. మీరు రెండూ వ్రాశారు సంతోషం. మీకు ప్రస్తుతము గురుమహాదశ 2-8-1989 వరకు ఉంటుంది. యీ దశ వెళ్ళితేనేగాని మీకు యోగారంభం కాదు. భవిష్యత్తు బాగుంటుంది. శనిదశ మంచిది. గురుదశ బాగా ఉండవలసినదే, గాని శకటయోగం వుంది. అందుచే గురుదశ ప్రశస్తం కాదు. అధియోగం పూర్తిగా పట్టలేదు, అయినా ఫరవాలేదు. శనిదశలో మీకు change of place వస్తే రావచ్చు.

జి. సుబ్రహ్మణ్యశాస్త్రి తెనాలి

ప్రశ్న : విద్య కొనసాగునా? ఉద్యోగం రావడానికి ఎంత కాలం పట్టును? మంచిరోజులు ఎప్పుడు వచ్చును? వివాహం ఎప్పుడు?

సమా : విద్య కొనసాగే అవకాశాలు తక్కువ. ప్రస్తుతం మీకు నడుస్తున్న కుజదశ మంచిది కాదు. ఉచ్చాంశ, గురుదృష్టి ఉన్నందున యీ మాత్రమైనా విద్య వచ్చింది. అగుటకు కుజుడు విద్యా స్థానాధిపతియే. ఏం లాభం? స్థితి మంచిది కాదు. 22-7-88 వరకు కుజదశ వుంటుంది. Bad Period, పైగా ప్రస్తుతం ఏలినాటి శనికూడా ప్రారంభమైనది. చాలా సమస్యలు బయలుదేరును. Face the difficulties like a man. కుజ, శనులకు జపం చేయించండి. కొంతవరకు ఉపశమనం రాహుదశ కొంతవరకు మంచిది. వివాహమా? తొందరేల? సంసారం సాగరం- యీ రోజులలో మరీ మరీ. 26 సం॥ రావాలి వివాహమునకు. మానవుడు పరభాగ్యోపజీవి కారాదు. తన కాళ్ళమీద తాను నిలబడాలి. అది లేకుండా వివాహమెందులకు. బ్రహ్మచారి ముదిరినా ఈ రోజులలో యిబ్బంది లేదు. ఆడపిల్లలు సమృద్ధి. పెండ్లి కాకపోదు లెండి. దిగులు పడకండి. ఉద్యోగం ప్రస్తుతం లేదు. గ్రహశాంతి (కు. శ) వల్ల పడుతూ-లేస్తూ విద్య కొంతవరకు చిగురేస్తుంది. చెడుస్నేహాలు వస్తవి. జాగ్రత్త. అపఖ్యాతి వచ్చే రోజులు. ★

## జ్యో తి ష వా ణి

పేరు...........

పూర్తి చిరునామా.

లేఖ వ్రాయు తేది.....................

టైము పగలు/రాత్రి......................

జననతేది...............(తేదిలేనిచో సుమారు వయస్సు)

గమనిక :

జాతకము పంపువారు, పేరు, చిరునామా, జనన తేది టైము-రాశి అంశ మహాదశా శేషము పంపవలెను. కూపనే విధిగా జతపరచవలెను. అంటించరాదు. సమాధానములు "శ్రీవాణి" లోనే చూడగలరు. పర్సనల్‌గా వ్రాయబడవు గాన కార్డు, కవరు, సమాధానం కొరకు పంపరాదు. జాతకమునకు కాపి తీయడం చేతకాని వారు ఫోటో తీయించి పంపుట మంచిది. చక్రములలో 12 గళ్ళు (రాసులు) సరిగా గీయాలి. గ్రహాలను సరిగా వేయాలి.

శర్మగారిని పర్సనల్‌గా కలువగోరే వారు ముందుగా వ్రాసి ఎప్పుడు అవకాశమో తెలిసికొనవలెను. అవనిగడ్డ మెయిన్‌రోడ్డుపై గాలిగోపురమునకు అతి సమీపంలో వారి నివాసము. ఉత్తరముపై చిరునామాలో వారి పూర్తి పేరు లేక కవితా శర్మగారు, అవనిగడ్డ 521 121 అంటే చాలు.

—(సం)

# ఆ జాతివాళ్ళంతా సైనికులే

**మనకు తెలియని ప్రపంచం**

**మల్లాది వెంకటకృష్ణమూర్తి**

అర్ధరాత్రి రోడ్డుమీద కర్రతో కొట్టుకుంటూ వెళ్ళే గుర్ఖాలు మనందరికి పరిచయమే. సగటున 160 సెంటీ మీటర్ల పొడవుండే గుర్ఖాలు ప్రపంచంలోని వీరోచితంగా పోట్లాడే కొద్ది జాతులలో ఒకరని చాలామందికి తెలియదు. భారత సైనికదళంలో 70,000 మంది గుర్ఖాలున్నారు. గుర్ఖా రెజిమెంట్స్ మనకి చాలా వున్నాయి.

ఒక్క భారత సైనికదళంలోనే కాక బ్రిటన్, హాంగ్‌కాంగ్ మొదలయిన సైనికదళాల్లో గుర్ఖాలున్నారు. ప్రతి సంవత్సరం బ్రిటిష్ సైన్యాధికారులు నేపాల్‌కి వెళ్ళి వాళ్ళని తమ సైన్యంలో చేర్చుకోవడం 169 ఏళ్ళుగా పరిపాటి అయిపోయింది. మొట్టమొదటిసారిగా 1815 లో గుర్ఖాలు అప్పటి ఇండియన్ ఆర్మీలో, అంటే బ్రిటిష్ సైన్యంలో చేరారు. అసియా ఖండంలోని అతి సమర్ధవంత మైన సైనికులుగా క్రమంగా కీర్తి నార్జించారు. పదాతి దళంలో వారిని మించిన వారు అరుదు.

అందుకు చాలా కారణాలున్నాయి. చిన్నప్పటినుంచి వీరు కష్టజీవులు. నేపాల్‌లో కొండలు, పర్వతాలు, అధికం కాబట్టి వాటిని సునాయాసంగా ఎక్కి దిగడం బాల్యం నుంచే అలవాటవుతుంది. దాంతో ఎన్నిగంటల పాటయిన నిర్విరామంగా నడవగలిగే శక్తి ఒక్క గుర్ఖా లకే వుంది. ముఖ్యంగా కొండ చరియల్లో వీరి యుద్ధ పాటవం అసామన్యం.

నేపాల్‌లోని గోర్ఖా అనే గ్రామంలోని వారే వీరంతా. ఆ గ్రామం పేరుతో బ్రిటిష్‌వారు ఈ నేపాలీయులకి గుర్ఖాలుగా నామకరణం చేయడం జరిగింది.

సిపాయిల తిరుగుబాటులో, బ్రిటీష్‌వారు భారత రాజు లపై జరిపిన అనేక యుద్ధాలలో, మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలలో, భారతదేశం, పాకిస్తాన్‌లు విడిపోయే సందర్భంలో, వీరు యుద్ధాలలో పాల్గొన్నారు.

కలకత్తా, సింగపూర్, హాంగ్‌కాంగ్‌లలో ఇంకా అనేక చోట్ల వీళ్ళు సెక్యూరిటి ఆఫీసర్స్, పోలీసు దళాల్లో పనిచేస్తున్నారు.

మొగలాయిలు, రాజపుత్రులని ఓడించి నేపాల్ దేశా నికి తరిమివేసారు. వాళ్ళు నేపాల్‌లోని గోర్ఖా గ్రామ ప్రాంతాన్ని ఆక్రమించుకొని అక్కడి కొండ జాతుల వాళ్ళకి యుద్ధ విద్యని నేర్పించటంతో గుర్ఖా సైనికులకి అంకురార్పణం జరిగింది. గుర్ఖా యువకులకి యుక్త వయస్సు రాగానే వారు సైన్యంలో చేరడానికి వుబలాట పడతారు. బ్రిటిష్ లేదా భారత సైన్యంలో ఎన్నిక చేయ బడకపోతే తర్వాత సంవత్సరం మళ్ళీ ప్రయత్నిస్తారు. కాని మామూలు వుద్యోగ ప్రయత్నాలు మాత్రం వీరు చేయరు.

## ఢక్కా ముక్కీలు

దర్జీ చేతిలో పడ్డ బట్ట
ముక్కలు ముక్కలైనాకే
చక్కని రూపంతో బైటపడ్తుంది
ఢక్కాముక్కీలు తిన్న మనిషీ, అంతే!

— కమల్

# " ఆర్థిక స్వాతంత్ర్యానికి " అత్యుత్తమ మార్గం జాతీయ పొదుపు సంస్థలో ఏజెంట్‌గా చేరడం

ఉద్యోగం కోసం పడిగాపులు కాస్తూ మీ విలువైన కాలాన్ని వృధా చేసే బదులు మీరు జాతీయ పొదుపు సంస్థలో ఏజెంట్‌గా ఎందుకు చేరకూడదు ? అది మీరు ఎదురుచూస్తున్న ఉద్యోగం కన్నా ఎన్నో రెట్లు మేలైనది. అది కాకుండా మీకు మీరే బాస్. మీరు జమ చేయించే మొత్తాలపై 3% కమీషన్ లభిస్తుంది. మహిళలకు 5% కమీషన్ వచ్చే ప్రత్యేక పథకం కూడా వున్నది.

అవును ! నిరాశతో ఉద్యోగావకాశాలకై వెదికే (విద్యావంతులయినా, కాకపోయినా) మీ కందరికి బంగారుబాట చూపిస్తుంది, జాతీయ పొదుపు సంస్థ.

జాతీయ పొదుపు సంస్థలో ఏజంటుగా చేరి మీరు జమ చేయించే డిపాజిట్లపై 3% కమీషను పొందండి. ప్రజలకు నచ్చచెప్పి పొదుపు చేయడంవల్ల కలిగే లాభాలను వివరించగలిగే శక్తి, వాక్చాతుర్యం మీకుంటే చాలు. మహిళలకు 5% కమీషన్ వచ్చే ప్రత్యేక పథకం కూడా వున్నది.

మిగతా వివరాలకు మీ దగ్గరలోని పోస్టాఫీసులోగాని లేదా కలెక్టరేట్‌లోని తహశీల్దారును గాని, భారత ప్రభుత్వం జిల్లా పొదుపు కార్యాలయంలోగాని, రీజనల్ డిప్యూటీ డైరెక్టర్ (స్మాల్ సేవింగ్స్) ను గాని సంప్రదించండి.

## జాతీయ పొదుపు సంస్థ

మీ భద్రత మా లక్ష్యం

కమీషనర్, స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హిమాయత్‌నగర్, హైదరాబాదు – 500 029

"రామచంద్రమూర్తీ! ఇవాళ - శుక్రవారం".

"ఔను. నాలుగురోజుల నుంచీ పట్టువదలని విక్రమార్కుల్లా ప్రయత్నిస్తున్నాం మీ డాక్టరు బంధువుని కలుసుకుందుకు.

కాని...కుదరడంలేదు ! తమాషాగా ఆటంకాలు వొచ్చి పడుతున్నాయి. కప్‌కీ లిప్‌కీ మధ్య చాలా స్లిప్‌లు ( Between the cup and the lip - many ships ) అని ఎవరన్నారో కాని, చాలా నిజం సుమా !"




"మరే .... ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాంగా."

"నాకో చిన్న సందేహం వచ్చింది .... "

"ఏమిటి ?"

"ఈ నాలుగు రోజులూ - మ న కె దు ర యి న ది ఆడవాళ్ళే ...."

"అమ్మాయిలనవచ్చు."

"ఆఁ.... అమ్మాయిలు ...."

"ఐతే ?"

"అబ్బాయిలకి పిచ్చెక్కదా ?"

"ఎందుకెక్కదు ? ఇటువేపు ఆడవాళ్ళ వార్డేమో ...."

"కావచ్చు .... కాకపోనూ వచ్చు .... నాకు చిన్న అనుమానం కలుగుతూంది."

"చెప్పు."

"మరేమీలేదు .... మనకి తగులుతున్న వాళ్ళందరూ సీరియల్ పిచ్చివాళ్ళు ...."

"ఊఁ."

"సీరియల్స్ ఎక్కువగా చదివేది ఆడవాళ్ళు .... అమ్మాయిలు ...."

"ఔనట -"

"అందుచేతనే మనకి ఆడ పిచ్చివాళ్ళు .... పిచ్చి ఆడవాళ్ళు ?" ఎదురౌతున్నారేమో.

"కావచ్చు....అదుగో....బస్ వొస్తూంది...."

ఇద్దరూ అలర్ట్ అయ్యారు. వాళ్ళదృష్టం బాగుంది, బస్ ఆగింది, కూర్చుందుకు చోటూ దొరికింది !

బస్ మరీ రష్‌గా లేదు....ఎందుచేతనో.

**జ రి గి న క థ**

రామచంద్రమూర్తి, దయానిధి ఇద్దరూ వాచ్‌మెన్‌కి సమర్పించాల్సింది సమర్పించి లోపలికెళ్ళారు. అక్కడ ఉత్తరాల శీర్షిక ద్వారా పరిచయమయ్యి ప్రేమించుకున్న వాళ్ళ కథ. ప్రేమలో దగా మోసం ఆమెను పిచ్చిదాన్ని చేసాయి. ఆమె ఆ పరిస్థితికి కారణం 'నవలలు' అని తెలిసిన రామచంద్రమూర్తి గుండె బరువెక్కింది. బయటకి వెళ్ళేటప్పుడు వాచ్‌మెన్‌కి మళ్ళీ కొంత చెల్లించి బయటకి రావల్సి వచ్చింది. వాళ్ళు ఆ రోజు కూడ డా॥ విజయను కల్సుకోలేకపోయారు.

( ఇక చదవండి )

"జైలుకెళ్ళే వాళ్ళు దిగండి "...."పోలీస్‌స్టేషన్ కెళ్ళే వాళ్ళు .... జైలుకెళ్ళే వాళ్ళు .... దిగండి దిగండి ." కండక్టరు కుర్రవాడిలా ఉన్నాడు జోకు లేస్తున్నాడు. బస్-ఒక్కసారి గొల్లున నవ్వింది. రామచంద్రమూర్తి - ఆనందించాడు. ఔను. సిటీబస్ ప్రయాణం నరకమే కావొచ్చు. అంతమాత్రాన దానిని సాధ్యమైనప్పుడు సంతోషదాయకంగా చేసుకుందుకు ప్రయత్నించడం తప్పు కాదు. నరకంలో నవ్వి(ంచి) న వాడే నిజంగా ధన్యుడు.

గవర్నర్ బంగళా మిట్ట ఎక్కడానికి బస్సు కుయ్యో మొర్రోమంటూ బాధ పడుతోంది. ఎట్టకేలకు-దాని కష్టం తీరింది. మళ్ళీ పరుగు తీసి....

బెల్ మోగించాడు కండక్టర్.

బస్ స్లో ఔతూంది.

" బాబూ ! పిచ్చాసుపత్రికెళ్ళే వాళ్ళు గేటు దగ్గరకు రండి....

పిచ్చాసుపత్రికెళ్ళే వాళ్ళు...."

దయానిధీ రామచంద్రమూర్తి - తప్పు చేసినట్లు తల వొంచుకుని లేచి-గేటు దగ్గరకు వొచ్చి - బస్ ఆగడమేమిటి, దిగిపోయారు. ఇంకా-బస్ గొల్లుమంటూనే ఉంది.

" కండక్టరు ఉషారయిన కుర్రాడే " అన్నాడు దయానిధి.

" ఔను ". అంటూ కదిలాడు రామచంద్రమూర్తి.

దయానిధి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

పిచ్చాసుపత్రి గేట్‌మన్ .... యీ నాలుగు రోజులూ తమ మీద వేసిన జోకు వెయ్యకుండా - రోజుకో కొత్త జోకు వేసి డబ్బులు వొడుకుతున్నాడు.

నిన్నయితే మరీ దారుణం.

ఇవాళ .... ?

గేటువేపు చూశాడు.

వాడు అక్కడే ఉన్నాడు.

తమవేపే చూస్తున్నట్లున్నాడు.



ఇవాళ ఎలా బుట్టలో వేయాలా అని కాబోలు ఆలోచిస్తున్నట్లున్నాడు. సరే .... కానీయ్ .... వాడికిచ్చే రూపాయీ రెండూ కోసం కాదు .... వాడు తమని ఆటలాడిస్తున్నాడే అనే బాధంతా.

" దణ్ణాలు బాబూ ! "

తమని చూస్తూనే లేచి నిలుచున్నాడు.

దయానిధి - నమస్కారం అందుకున్నట్లు తల పంకించాడు.

" బాబూ ! తమరు కోపగించనంటే ఒక మాట...."

" ఏమిటి ? "

ఈ వయసులో .... తమరిలా .... ఏమీ బాగులేదు బాబూ " ?

" ఏమిటి నువ్వనేది ? "

" ఇవాళ నుంచి – ఎవరికి పడితే వారికి గేటొదలద్దని పెద్దమ్మగారు వోర్నింగొకటిచ్చారు బాబూ నాకు. "

" ఎందుకని ? "

" తమరేమనుకోకండి .... ఎవరో ఒకాయన .... మీలాటి వయసే .... రోజూ వొచ్చి నర్సులని చూస్తున్నాడట .... అంచేత .... ఎవరిని పడితే వారిని రానివ్వొద్దని .... "

నిర్ఘాంతపోయారిద్దరూ. " మేమలాటి వాళ్ళం కాదు. మా వయసు .... "

" మొగాడి వయసు ఆడపిల్లని చూడగానే అమాంతం పాతిక్కి పడిపోతుంది. రోజులలాగ ఉన్నాయి. ఎవరు మాత్రం–మేమలాటి వాళ్ళమే అని చెబుతారా? నేను జాగ్రత్తగా ఉండకపోతే ఉద్యోగం ఊడి పోతుంది. "

" మావల్ల ఊడదులే. మేము వెళ్ళేది డాక్టరుగారి కోసం...."

రెండురూపాయలు యివ్వబోయాడు.

" చెపించండి బాబు....కిట్టదు. రిస్కు లావయిపోయింది. నర్సుల కోసం వెళ్తేనే రెండు రూపాయలు చాలవు. డాక్టరు కోసమయితే....ఎక్కువుండాల. తమరే ఆలోచించండి, కష్టంవూ సుఖంవూ " అనేశాడు వాడు.

త్రాష్టుడా! అనుకున్నాడు దయానిధి. నీ డబ్బుల కోసం–పెద్దమనుషులమయిన మమ్మల్ని – ఆకతాయివాళ్ళగానూ, అమ్మాయిలని చూడ్డానికొచ్చే అల్లరి వాళ్ళగానూ కట్టెయ్యడానికి కూడా వెనుకాడలేదు! నిజం నీకు తెలుసు... అయినా అమాయకుడిలా వేషం వేస్తున్నావు. నిజంగా నువ్వు గుండెలు తీసిన బంటువే. సందేహం లేదు.



ఐదు రూపాయల నోటందించి—"కిడుతుందా ?" అడిగాడు.

" ఏం చేస్తాం .... సరిపెట్టుకుంటాను. తొరగా వొచ్చెయ్యండి ". అన్నాడు పెద్ద గేటులోని చిన్న గేటు తీస్తూ .... " ఒకరు చేసిన ఎదవపనికి అందరూ బాధ పడాలి....మీరు మంచోరే .... నాకు తెలుసు ". అని సానుభూతి వాక్యాలు పలుకుతూ స్వాగతం చెప్పాడు. వొళ్ళు మండినా నోరు మూసుకుని నడిచారు వాళ్ళిద్దరూ.

"వాడి తప్పు లేదు. సంసార భారం మనిషిని ఎంతకయినా దిగజారుస్తుంది. ఆ తెలివితేటలు .... మననే బోల్తా కొట్టించి డబ్బులు వొడికేయగల ఆ తెలివి తేటలు - వీడికెక్కడనుంచి వొచ్చాయంటావు ?"

రామచంద్రమూర్తి మౌనంగా ఉండిపోయాడు. ఇవాళయినా ఆ డాక్టరుని దయానిధి కలుసుకోగలిగితే బాగుండును. ఇక్కడేదో జరగడం .... మనసు పాడ వడం .... ఇంటికెళ్ళినా అన్నం సహించదు. నిద్ర పట్టదు. ఎన్నాళ్ళిలాగ ?

"బ్రతుకు తెరువు .... అదే వాడికా తెలివితేటలు నేర్పింది. " అన్నాడు దయానిధి పెద్ద సత్యం కనిపెట్టి నట్లు.

" ఓహో ! "

ఇద్దరూ నడవసాగారు.

వరండా క్షయింక అట్టే దూరం లేదు.

జయించేశామన్నట్లు ఊపిరి పీల్చుకున్నాడు రామ చంద్రమూర్తి. తన మొర - ఆ దేవుడు ఆలకించి నట్లే ఉంది. ఇకనయినా యీ పిచ్చాసుపత్రి ప్రదక్షిణా లకు స్వస్తి చెప్పగలిగితే - అంతే చాలు.

ఆ క్షణంలో ....

వరండామీంచి .... మెట్లు దిగుతూ ....

అమ్మాయి !

నర్స్‌లా ఉంది.

బహుశా నర్సే ఏమో. ఒక చేతిలో చిన్న వ్యానిటీ బాగ్ ఉంది. రెండో చేతిలో పుస్తకం .... లావుగా ఉంది ఆ పుస్తకం .... కనుక తెలుగు నవల అయి ఉండాలి.

ఆమె -

రామచంద్రమూర్తి కెదురుగా వొస్తూంది.

ఒక్కసారి తలెత్తి అతని వేపు చూసింది.

అంతే.

అతన్నే చూస్తూ నిలబడి పోయింది.

వెర్రిదానిలా....పిచ్చదానిలా....

నిలువు గుడ్లేసుకుని....

అతన్నే చూస్తూ....

( స శే షం )

( 12వ పేజీ తరువాయి )

గురించి ఆలోచించకపోవడం శోచనీయం. జీవితాన్ని సుజీవితం చేసుకునేందుకు సాహిత్యం ఎంత అవసరమో జీవితాన్ని చరితార్థం చేసుకునేందుకు ఆధ్యాత్మిక చింతన కూడా అంతే అవసరం. అందుకే ఉత్తమశ్రేణికి చెందిన సాహిత్యం ఆధ్యాత్మికంగానే ఉండటం పరిణతి చెందిన ప్రతి సాహిత్య చరిత్రలో మనం గమనించవచ్చు. భారతీయ భాషల సారస్వత వికాసాన్ని చారిత్రకంగా తులనాత్మకంగా పరిశీలించి చూస్తే ఈ విషయం మనకు అద్దంలో మనల్ని మనం చూచుకున్నట్లు స్పష్టంగా గోచరిస్తుంది. తెలుగులో పోతనామాత్యుడు భాగవత రచన చేసిన సమయానికి కొంచెం అటు ఇటుగా హిందీలో సూరదాస తులసీదాసులు భక్తి వాఙ్మయంతో ఆర్యావర్తాన్ని రసాప్లావితం చేసిన విషయం మనకు తెలుసు. మన దేశభాషల్లో ఏ భాషను తీసుకున్నా 13-15 శతాబ్దాల మధ్యయుగం స్వర్ణయుగంగా కనిపిస్తుంది. కేవలం భక్తి సాహిత్యాన్నే ఆధ్యాత్మిక సాహిత్యం అనేందుకు వీలులేదు. కబీరు, వేమన లాంటి సర్వసంగ పరిత్యాగులు నిజమైన ఆధ్యాత్మికతను ప్రసరింపజేసిన మహనీయులు. ఇలాంటి మహనీయుల కోటికి చెందిన వీరబ్రహ్మంగారి కాలజ్ఞానం ఇప్పటికీ మనకు అప్పుడప్పుడు కనువిప్పుగా వినిపిస్తుంది.

అసలు ఆధ్యాత్మికత అంటే ఏమిటి అని స్పష్టంగా తెలుసుకోవాలి.. అధ్యాత్మమంటే ఆత్మయందు నివసించుట, ఆత్మ చెంతకు చేరి ఆత్మతత్త్వన్ని అవగాహనం చేసుకొని తాను ఇంతవరకు తనదనుకుంటున్నది నిజంగా తనదికాదనీ, తనకు తెలియకుండానే తనను నడిపిస్తున్నది తనలో తనదైయున్న ఆత్మతత్త్వమేననీ, అదే తాననీ, తానే అది అనీ తెలుసుకోవటమే ఆత్మజ్ఞానం. అదే అధ్యాత్మం. దీనినే భగవద్గీత చాలా సులువుగా తేల్చి చెప్తుంది. మాటిమాటికీ బ్రహ్మ, అధ్యాత్మం అని గీతాచార్యుడు అంటుంటే అర్జునుడు వినివిని ఒక్కక్షణంలో కృష్ణుణ్ని నిలవదీసి 'ఆ బ్రహ్మ ఏమిటి, ఆ అధ్యాత్మమంటే ఏమిటి?'(కింతద్ బ్రహ్మ, కిమధ్యాత్మం?) అని సూటిగా అడుగుతాడు. దీనికి సమాధానం కూడా సూటిగానే లభిస్తుంది. స్వభావమే అధ్యాత్మం (స్వభావోధ్యాత్మముచ్యతే) అని గీతాచార్యుడంటారు. తాను నిజంగా ఎవరో తెలుసుకొని తానయిన తాను కావటమే అధ్యాత్మమని దీనికి సారాంశం.

దీనికి సాహిత్యం దోహదం చేసినంతగా మరో ప్రక్రియ చెయ్యదు. అందం, అనురాగం, ఆనందం, సాహిత్యం సాధించగల విభూతిత్రయి. వీటిలోనే ఆధ్యాత్మికత కూడా ఉంది. కాని దృశ్యాదృశ్యంగా ఉంటుంది. సాహిత్యం ప్రత్యక్షంగా ఏమీ ప్రచారం చెయ్యదు. కాంతా సమ్మితంగా కావలసిన తత్త్వాన్ని కమనీయంగా అందించటమే సాహితీపరుల ధ్యేయం. ఉదాహరణకు ఆదికవి రచించిన రమణీయ కావ్యం రామాయణం ప్రత్యక్షంగా ఏ విధమయిన ఉపదేశాన్నీ అందించదు. అంతా కథలో ఇమిడి ఉంటుంది. పాత్రల సంభాషణలలో, పరిస్థితుల పర్యావరణంలో పరమార్థం అందుతుంది. పాఠకులు ఎంతటి సంస్కారంగల వాళ్ళయితే అంతటి సారం వాళ్ళు గ్రహించగలుగుతారు.

మచ్చుకు మారుతి తొలిసారి రామలక్ష్మణులను కలుసుకొని పలకరించుకున్న ఘట్టం కొంచెం జాగ్రత్తగా గమనిస్తే సాహిత్య సృష్టిలో ఆధ్యాత్మిక దృష్టి ఎలా మేళవించి ఉంటుందో తెలుస్తుంది. తన యజమాని సుగ్రీవుని గురించి హనుమంతుడు ఏమేమో చెప్తాడు. రామలక్ష్మణులు చాలా ఆసక్తితో హనుమ మాటలు వింటారు. కాని రాముడి దృష్టి హనుమ చెప్పిన మాటలకంటె ఆ మాటలు అతని నోట వెలువడిన తీరుమీదే ఎక్కువగా ప్రసరిస్తుంది. ఇంతసేపు మాట్లాడినా ( బహు వ్యాహరతానేన ) ఏ మాత్రం పొల్లుమాట రాలేదని ( నకించిదపశబ్దితం ) రాముడు లక్ష్మణుడితో అంటాడు. అంతటితో ఆగక హనుమ మాటలు వింటుంటే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం సాకల్యంగా ఆకలించుకుంటేనే కాని ఇలా మాట్లాడటం సాధ్యం కాదని అనిపిస్తుంది వాక్యకోవిదుడయిన కోదండపాణికి.

"నా నృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం విభాషితమ్"

ఋగ్వేదంలోని వినయ విధేయతలు, యజుర్వేదంలోని ధారణాశక్తి, సామవేదంలోని విజ్ఞత హనుమ వాక్కులో ప్రతిఫలిస్తున్నట్టు రాముడు క్షణంలో గ్రహిస్తాడు. ఇలాంటి సంస్కారంతో వెలువడిన వాక్కు అర్థంతోపాటు పరమార్థాన్ని అందించగలుగుతుంది. సంస్కారంలేని వాక్కు అశోకవనంలో శోకంతో శుష్కించిపోయిన సీతాదేవిలా ఒక విషయం చెప్పబోయి తీరా చెప్పేసరికి మరో విషయంగా మారిపోతుందని వాగ్వివేకి వాల్మీకి పరోక్షంగా వాక్సంస్కారాన్ని గురించి చెప్తాడు.

నిజానికి సాహిత్యంలో కాని, అధ్యాత్మ తత్త్వంలో కాని కొత్తగా చెప్పవలసింది ఏమీ ఉండదు. పరమ సత్యం ఒక్కటే. కాని దానిని దేశకాలాలకు అనుగుణంగా మార్చి మార్చి చెప్పవలసి ఉంటుంది. వేద మనూచ్య (వేదాన్ని అనువదించాలి వల్లించాలి.) అన్న వేదవిదుల ఆదేశంలో ఇదే సందేశం ధ్వనిస్తుంది. 'చెప్పినదే చెప్పుదనని చెప్పుకొందు రదియె మరల చెప్ప దలచినాడను; మరి చెప్పనా మరొక్కసారి' అని సుప్రసిద్ధ ఆంగ్ల మహాకవి టి. యస్. ఇలియట్ తన పాఠకాలకు తన పునరుక్తి పారవశ్యాన్ని వివరిస్తాడు. ఈనాడు మనం అనుసరించవలసిన ఆధ్యాత్మిక సందేశ సరళి ఇలాగే ఉండాలి. విలియమ్ వర్డ్స్‌వర్త్ అన్నట్లు బోధకత్వం లేనిదే కవితకు సార్థక్యం లేదు. (A poet is nothing if not a teacher.) కాని యీ బోధకత్వం బాధాకరంగా ఉండకూడదు. సరసమైన వాక్కు జడజగత్తును కూడా చైతన్యవంతం చేయగలదు.

ఆధ్యాత్మిక చైతన్యం సాహిత్య పరంగా అందించినందువల్ల ధనవంతులు దానశీలురవుతారు. స్వార్థపరాయణులు త్యాగశీలురవుతారు. బలవంతులు దయామయులవుతారు. ప్రపంచంలో దైన్యం పోయి దేవత్వం హెచ్చుతుంది. మానవులు దేవతలవుతారు. లేకుంటే దానవత్వం ప్రబలుతుంది. అందరిలో ఉన్నది ఒకే ఆత్మ చైతన్యం. తనలాంటివారే తనతోటి మానవులు అని త్రికరణ శుద్ధిగా నమ్మినవారు తన సహజీవులకు ఉపకారం చేయలేక పోయినా అపకారం మాత్రం తలపెట్టరు. స్వార్థ బుద్ధిని పోగొట్టి పరోపకార పరాయణతను పెంపొందించాలంటే కేవలం సాహిత్యంవల్ల సాధ్యం కాదు, కేవలం అధ్యాత్మంవల్ల కూడా వీలుకాదు. రెండింటినీ సమన్వయ పరచుకొని ఆధ్యాత్మిక సాహితి అనదగ్గ అభినవ రచనా ప్రక్రియలను ప్రచారంలోకి తీసుకురావాలి. దానికి శ్రీవాణిలాంటి పత్రికలు చాలా అవసరం. దిక్కు తెలియని సామాన్య పాఠకులు దారి తప్పుతుంటే చూస్తూ ఊరకుండటం ఉత్తమ దేశికుల లక్షణం కాదు. ప్రజల పఠనా శక్తిని సరియైన మార్గంలో ప్రవేశపెట్టి భౌతికంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా జన జీవితాన్ని రూపొందించే నైతిక బాధ్యత నీతికోవిదుల మీద ఉంది.

పారమార్థిక చింతన మనగానే భౌతిక సమృద్ధినీ, నిత్యజీవిత సమస్యలనూ, సామాన్య మానవుల సాధక బాధకాలనూ ఉపేక్షించటమని భావించకూడదు. భారతీయ మనీషుల జీవిత దర్శనం ఏకాంగికం కాదు. సర్వాంగ సుందరమయిన జీవితసౌధాన్ని నిర్మించటం మహర్షుల మహదాశయం. మహాభారత యుద్ధం ముగిసిన తర్వాత అరాజకత్వం రూపుమాపి సువ్యవస్థితమయిన రాజ్యాంగాన్ని నెలకొల్పాలని సంకల్పించిన ధర్మనందనుడికి భీష్ముడు పరమాత్మ తత్త్వాన్ని బోధిస్తాడు. అదే పరమధర్మమంటాడు. విశ్వమే విష్ణువంటాడు. ప్రపంచంలోని ప్రతి జీవికూడా పరమాత్మ స్వరూపుడే అంటాడు. కాని యీ విషయం చాలామందికి తెలియదు, కొద్దిమందికే తెలుసునంటాడు. ప్రారంభంలో ప్రతి జీవి కూడా పంచభూతాలతో కూడిన భూతాత్మ స్వరూపుడయి తన జీవిత యాత్రను ఆరంభిస్తాడు. కాని ప్రపంచంలో తానొక్కడే జీవించేందుకు అధికారి కాననీ అలాంటి అధికారం అన్నగత ప్రాణులకందరికీ ఉందనీ గమనించిన కొద్దీ అతనిలోని భూతాత్మ పూతాత్మగా మారుతుంది. 'నా కాయుష్యం,

"నా కారోగ్యం' అనుకుంటున్న ఏకాంత జీవి, 'సర్వే జనాః సుఖినో భవంతు, సమస్త సన్మంగళాని భవంతు,' అని అనుకోగలుగుతాడు. ఏకాత్ము డనేకాత్ముడవుతాడు. అనేకత్వంలో ఏకత్వం చూడగలుగుతాడు. ఇదే ఆత్మ వంతుల లక్షణం. ఆధ్యాత్మిక సాధనవల్ల ఇది సాధ్య మవుతుంది. ఇలా పారమార్థికమయిన భావయోగంతో పూతాత్మ అయిన భూతాత్మకూ నిత్య శుద్ధమయి సహజ సిద్ధమయిన పరమాత్మకూ వ్యత్యాసం ఉండదు. ఈ స్థితిని అందుకోబట్టే స్థితప్రజ్ఞకయినా దాశరధి తన లోక సంగ్రహ భావాన్ని రాజ్య లాలసతో రగులుకొని పోతున్న కైక మ్మను శాంతపరుస్తూ అంటాడు.

"నా హ మర్థ పరోదేవి లోకమావస్తు ముత్సహీ
విద్ధిమాం ఋషిభిస్తుల్యం విమలం ధర్మమాశ్రితం"

తల్లీ, నాకు అర్థం ప్రధానం కాదు. లోకం నా కోసం ఎదురుచూస్తున్నది. అనర్థకరమయిన అర్థాన్ని త్యజించి నిర్మలమయిన ధర్మాన్ని సేవించే ఋషి పుంగవుల సాన్నిధ్య సాహచర్యాలతో నా జీవితం చరితార్థం చేసుకో వాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతున్నదంటాడు లోకాభి రాముడయిన రాముడు.

ఇలాంటి లోకకల్యాణానికి కంకణం కట్టుకున్న శ్రీవాణి చిద్విలాసంతో సశ్రీకంగా పురోగమించాలనీ, శ్రీ సందేశం దేశ దేశాంతరాలలో వ్యాప్తి చెందాలనీ మనమందరమూ ఆశించాలి. ఆశించటమే కాక దానికి దగిన చేయూత నివ్వాలి. శ్రీవాణికి కూడా ఒక చిన్న మనవి. ఇది తెలుగు పత్రిక అయినా తెలుగు వెలుగులో భారత భారతిని ప్రతిఫలింప జేసుకొనే బాధ్యతను కూడా కొంతవరకు వహించగలిగితే ఆ వాణి అఖిల భారత వాణిగా వృద్ధి పొంది భారతీయుల నందరినీ సశ్రీకం చేయగలదు. శ్రీవాణి సంపాదకులు కొమరగిరివారు పూనుకుంటే యిది అంత అసాధ్యమయిన పని కాదు.

వాణీం భజత శ్రీవాణీం —

## ప్రశ్నలు-సమాధానాలు

1. నవధాన్యము లేవి ?
2. తేలికైన లోహమేది ?
3. గ్రుడ్డివారు చదువుటకు మాట్లాడుటకు ఉపయోగించు భాష ఏది ?
4. Gate way of India అను పేరుగల నగరమేది ?
5. అర్ధరాత్రి సూర్యుడు కనిపించే దేశమేది ?
6. 'అంకుల్ సామ్' అని పిలువబడు దేశమేది ?
7. లెటర్‌లో చివర 'P. S' అని అంటే అర్థమేమి ?
8. తమిళ రామాయణం రచించినదెవరు ?
9. 'లాల్' 'బాల్' 'పాల్' పూర్తి పేర్లు ఏమిటి ?
10. 'ఏ దేశ మేగినా, ఎందు కాలిడినా' అను గేయము రచించినదెవరు ?

★★

1. వడ్లు, ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనుములు, కందులు, శనగలు, 2. లీథియమ్ 3. బ్రెయిలీ 4. బొంబే 5. నార్వే 6. U. S. A 7. Post Script 8. కంబరుకవి 9. లాలాలజపతిరాయ్, బాలగంగాధరతిలక్, బిపిన్ చంద్రపాల్. 10. రాయప్రోలు సుబ్బారావు

'శ్రీవాణి' వార్షికోత్సవంలో.

# శ సమైక్యతను సాధించేది సాహిత్యమే

భారతీయ సాహిత్యం ఏ భాషలో వ్రాసినా, ఏ ప్రక్రియా పరంగా రచించినప్పటికీ, భారతీయ సాహిత్యంలో వున్న తాదాప్య భావం మాత్రం ఒక్కటే. రామాయణం లేని భారతీయ భాషంటూ లేదు. అదేవిధంగా ప్రపంచ భాషలలో రామాయణం ఏదో ఒక రూపంలో సాక్షాత్కరిస్తూనే వుంటుంది. కేరళ దేశంలో రామాయణం మీద వున్న భక్తి ప్రపత్తులు నేనెక్కడా చూడ లేదు. వామపక్షీయులు ఎందరో నెలకొని యున్న కేరళలో, ఈనాటికీ ముఖ్యంగా పల్లె పట్టులలో సంధ్యదీపం పెట్టగానే మళయాళ మహాకవి రచించిన ఆధ్యాత్మిక, రామాయణంలోనుంచి కొన్ని శ్లోకాలు చదవడంపరిపాటి.

డా॥ చల్లా రాధాకృష్ణ శ

సుప్రసిద్ధ విద్వాంసుడు సునీల్‌కుమార్ ఛటర్జీ " The Ramayana and Mahabharata are India " అని ఒక చోట వ్రాశారు. భారతదేశమంటే పర్వతాలు, నదులు కావచ్చు. కాని విశాల ప్రపంచానికి భారతీయ ఆత్మను ప్రదర్శించిన కావ్యద్వయం రామాయణము, భారతము. భారతీయ సుందరోద్యానంలో వికసించిన దివ్య ప్రసూనాలు రామాయణ భారతాలు. ఈ రెండు మహా కావ్యాలు భారతీయ ఆత్మను ప్రతిబింబిస్తున్నాయని పండిత ప్రకాండుల అభిప్రాయం.

ప్రపంచంలో షుమారు 3 వేల భాషలున్నాయని ప్రతీతి. భాషా తత్త్వశాస్త్రజ్ఞుల అంచనా ప్రకారం లిపి వున్న భాషలు 2798. భారతదేశంలో చాలా భాషలున్నప్పటికీ ఈనాడు జాతీయ సమైక్యాన్ని సాధిస్తున్నాం. మన భారతీయ సాహిత్య చరిత్రను సింహావలోకనం చేసి చూచినట్లయితే ఆసేతుశీతనగమైన ఈ దేశాన్ని కలిపింది రాజకీయాలు మాత్రం కావు. కేవలం సాహిత్యం మాత్రమే. ఎక్కడి శీతనగం, ఎక్కడి కన్యాకుమారి. ఈ రెంటినీ ఏకం చేసింది మన భారతీయ సాహిత్యం. భాషలు భిన్నంగా వున్నప్పటికీ ఈ భాషలలో అణిగిమణిగివున్న అంతరార్థం మాత్రంఒక్కటే. దేశసమైక్యతను సాధించేదిసాహిత్యమే.



రామాయణాన్ని మనం సంస్కృత కావ్యంగా చదవడం లేదు. అది మన తెలుగు కావ్యంగా చదువుతున్నాం. అది మన తమిళ కావ్యంగా పఠిస్తున్నాం. ఇటువంటి భావం కలగడానికి కారణం మన మహాకవులు తమ కల్పనలతోనే కాకుండా, ఆయా ప్రాంతాలలో నున్నటువంటి కథలు, గాధలు అన్నీ చేర్చి వాటికి ఒక వైశిష్ట్యం చేర్చారు కనుక తెలుగులో నున్న రామాయణాలు చాలావరకు యథావాల్మీకాలు కాకపోయినప్పటికీ, అందులో ఎన్నో అవాల్మీక సంఘటనలు కన్పిస్తూ వున్నప్పటికీ, అవన్నీ కూడాను వస్తుతః వాల్మీకానికి ప్రతిబింబాలుగానే కాకుండా, ఆయా కాలపు ప్రజల అనుభూతులను కూడాను చక్కగా, సవిమర్శనంగా ప్రతిబింబించే దివ్య దర్పణాలుగా ప్రతిభాసిస్తున్నాయి. ఈ ఉద్దేశ్యంతోనే మన ప్రాచీన సాహిత్యాన్ని చూడాలి గాని, ఈ ప్రాచీన సాహిత్యంలో వున్న కథలు, గాధలు మనకు సంబంధించినవి కావు అనే అభిప్రాయంతో గనుక చూచినట్లయితే, మనం బహుశః భారతీయ సాహిత్యాన్ని చక్కగా అర్థం చేసుకోనివాళ్ళమవుతాం. ఈ దృష్టితోనే భారతీయ సాహిత్యాన్ని చదవాలి. అప్పుడే భారతీయ సాహిత్యంలోని ఏకత్వం మనకు స్పష్టంగా అర్థమవుతుంది.

మహాకవి సుబ్రమణ్య భారతి "పదునెనిమిది భాషలు గలది, కాని చింతనా స్రవంతి మాత్రం ఒక్కటే."

దీనినే మన ఉపనిషద్వాణి కూడాను "ఏకం సత్ విప్రా బహుదా వదంతి" ఉన్న సత్యం ఏదో ఒక్కటే దానిని పండితులు వేరువేరు రకాలుగా చెబుతున్నారనేది సత్యం. కనుక ఈ దృష్టితో చూచినట్లయితే భారతీయ భాషలు విభిన్నములైనప్పటికీ, భారతీయ సాహిత్యంలో కానవచ్చే సాహిత్యం మాత్రం ఒక్కటే Indian Literature is one though written in different languages అన్నారు పెద్దలు. అయితే ఈ వివిధమైన భాషలలో నున్న సాహిత్యాన్ని మన భాషలోనికి తీసుకొని రావాలని పాండురంగారావుగారు సూచించారు. శ్రీవాణికి ఒక మంచి సూచన చేసారు. ఇది అనువాదం వలననే సాధ్యం కావాలి. అయితే అనువాదం చేయడం చాలా కష్టం. అనువాదం చదువుతున్నప్పుడు మూలంలోని భావమే కాకుండా, మూలంలో నున్నటువంటి రామణీయకమును కూడా పాఠకులు అర్థం చేసుకున్నప్పుడే, ఆ మూలంలోని సౌందర్యాన్ని చక్కగా అర్థం చేసుకోగలుగుతారు.

ఇంగ్లీషులో కొంచెం మోటుగానే అంటారు. "Translation is like a woman, if she is beautiful, she is not faithful; if she is faithful, she is not beautiful." కేవలం పఠన యోగ్యతకోసం అనువాదం కనుక చేసినట్లయితే, మూలంలోని సొగసు, రామణీయకం నశించవచ్చు. కనుక అనువాదకం కత్తి మీద సామువంటిది. అందువలననే "Translators are traitors" 'అనువాదకులు ద్రోహులు' అని ఇటాలియన్ సామెత. కనుక అనువాదంలో ఇంత కష్టమున్నది. అయినప్పటికి మనప్రాచీనులు అనువాదం అని చెప్పకుండా అనువాదాలు చేసి చూపారు. అదే మన నన్నయ్య తిక్కనాదులు చేసిన పని. యథానువాదం అని చెప్పలేము, కాని యథానువాదం అన్నంతగా యథానువాదం చేసి పోయారు. కనుకనే ఈ బహుభాషా నిలయమైన మన భారత దేశంలో నేను భారతీయుడ్ని అని సగర్వంగా చెప్పుకోవాలన్నట్లయితే, ఆ భారతీయ సాహిత్యాన్ని నాదిగా చేసుకోవాలన్నట్లయితే అందుకు సమర్థములైనటువంటి అనువాదాలు తప్ప మరొక మార్గం లేదు. కాని అనువాదం చేయడం కష్టం. అనువాదంలోని కష్టాన్ని గ్రహించి, అనువాదకులను గౌరవించినప్పుడు అనువాదం అంటే చక్కటి అవగాహన గౌరవం, ఏర్పరచుకున్నప్పుడు ఆ అనువాదములు రాగలవు. సమర్థవంతులైన అనువాదకులు, ద్విభాషా పండితులు లేకపోయినప్పటికీ కొంతమందయినా వున్నారు. కనుక ఇటువంటి అనువాదాలు మన దేశంలో రావాలి. అనువాదం కష్టంతో కూడుకున్న పని గదా యని, అనువాదాల మీద శీతకన్ను వేసినట్లయితే ఏనాడూ మన భారతీయ ఆత్మను మనదిగా చేసుకోడానికి ప్రయత్నం చేసినవారము కాము. అంతేగాక మన ఇరుగు పొరుగు భాషలను అర్థంచేసుకోడానికి ప్రయత్నించాలి. ఎక్కడో పాశ్చాత్య దేశాలలో వున్న మూడవ తరగతి కవిని గురించి తెలుసుకుంటున్నాము గాని, తమిళకవి సుబ్రమణ్య భారతిని గురించి మనకు తెలియదు. అలాగే ఇతర భారతీయ భాషలలో మహాకవులను గురించి మనకు తెలియదు అలాగే మన కందుకూరిని గురించి ఇతర భాషల వారికి తెలియదు. కనుక ఈతెలియనితనం నశించాలంటే అందుకు సమర్థములైన అనువాదములు తప్ప మరొక మార్గములేదు. కాని అనువాద కార్యక్రమంలో పాల్గొన్నవారిని, ప్రోత్సహిస్తున్న వారిని కూడాను ముఖ్యంగా పాఠకులు ప్రోత్సహించినట్లయితే, తప్పనిసరిగా మన దేశంలో చక్కటి అనువాదాలు రావడానికి అవకాశం వున్నది. ఎప్పటికైనా భారతీయ ఆత్మను అందరూ కూడాను సుస్పష్టంగా అర్థం చేసుకోదలచినట్లయితే మంచి అనువాదం ఒక్కటే శరణ్యంగా కనిపిస్తున్నది గాని, వీరందరిని అన్ని భాషలు నేర్చుకోమని చెప్పడం వివేకం కాదు. మన భారతీయ రాజ్యాంగంలో కొన్ని భాషలు మాత్రమే గుర్తించబడ్డాయి. సుమారు 22 భాషలను కేంద్ర సాహిత్య అకాడమీ గుర్తించింది. కనుక ఈ వివిధ భాషా సౌందర్యాన్ని కూడా మనదిగా చేసుకోవాలనుకుంటే శ్రీ పాండురంగారావుగారు సూచించిన విధంగా శ్రీవాణి పత్రిక ఒక్క తెలుగు వ్యాసములకే గాక ఇతర భాషలలో నున్న సౌరభాలను కూడాను తెలుగు ద్వారా తెలుగు వారికి అందించినట్లయితే, తెలుగు వారందరూ కూడాను భారతీయ సాహిత్యానికి నిజమైన వారసులు కాగలరు.

శ్రీ వైష్ణవాచార్యులు చెప్పినట్లుగా శ్రీవాణి మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్థిల్లాలని కోరుతూ, శ్రీవాణి వంటి ఒక చక్కటి పత్రికను నడుపుతున్న సాహసి శ్రీ కృష్ణమోహనరావుగారిని కొనియాడుతూ మీకందరికీ కూడా ఐదు వది చేస్తున్నాను. ★

# స్వీకారం

ఎం. ఎస్. ఎం. గారి " కలం చిదులు "
ప్రతులకు : యం. సుబ్రమణ్యం
27-20-21 మ్యూజియం రోడ్, గవర్నరుపేట
విజయవాడ-2

" నాలో ప్రవహిస్తోంది నది " (కావ్యం)
వెల : రు. 6-00
రచన : డా. మాదిరాజు రంగారావు
ప్రతులకు : సాహితీ సమితి, ఇ. నెం. 5-11-114/4
హన్మకొండ, వరంగల్-9

" మంచీ మర్యాదా "
వెల : రు. 10-00
రచన : వాసమూర్తి
ప్రచురణ : "శ్రీవాణి" 1-8-702/105
నల్లకుంట, హైదరాబాద్-500 044

" సరిగా ఆలోచించడం "
వెల : రు. 14-00
రచన : వాసమూర్తి
ప్రచురణ : "శ్రీవాణి" 1-8-702/105 నల్లకుంట
హైదరాబాద్-500 044

## పుస్తక సమీక్ష

పుస్తక సమీక్ష కొరకు విధిగా రెండు ప్రతులు పంప ప్రార్థన. ఒక ప్రతి పంపినవి సమీక్ష చేయబడవు. గమనించి సహకరించ ప్రార్థన.

— సం.

" విధి విలాసము " (కథా కావ్యం)
వెల : రు. 5-00
రచన : షేక్ అలీ
ప్రతులకు : షేక్ అలీ, జూనియర్ తెలుగు లెక్చరర్
గవర్నమెంటు జూనియర్ కాలేజి
దొనకొండ (ఆర్. యస్) 523 305 ప్రకాశం జిల్లా

" భగవద్వచనములు "
వెల : రు. 5-00
అవతార్ మెహెర్‌బాబా సందేశములు
సంకలనం : జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు
ప్రతులకు : 29-36-12 మ్యూజియం రోడ్
విజయవాడ-2

" మెహెర్ మందారం "
వెల : రు. 4-00
సంకలనం : జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు
ప్రతులకు : 29-36-12, మ్యూజియం రోడ్
విజయవాడ-2

" విశ్వజనని శ్రీ రాజరాజేశ్వరీ చరిత్ర "
రచన : డా. పి ఎస్.ఎన్. మూర్తి, డి. సుర్యనారాయణ
ప్రతులకు : డి. సుర్యనారాయణ, ప్రిన్సిపాల్
కాలేజి ఆఫ్ ఎడ్యుకేషన్
శ్రీకాకుళం (ఆం. ప్ర)

" చీపురుకట్ట శతకం "
వెల : రు. 5-00
రచన : పి. వి. యస్. పాత్రో
ప్రతులకు : పి. వి. యస్. పాత్రో
పాచిపెంట-532 592, విజయనగరం జిల్లా

" ముంగిటి ముత్యం "
వెల : రు. 30-00
రచన : శ్రీమతి సి. వేదవతి
ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య
బుట్టాయిపేట, మచిలీపట్నం-521 001 ★